# విప్లవ వీర కిశోరం భగత్‌సింగ్

మే. 1985 •
వెల 2.50 •

నవలా! ఉపనవలా!! సీరియల్ ప్రారంభం.





# శివాజి

సాంస్కృతిక మాస పత్రిక

# అభిప్రాయవేదిక

"యవనిక" సీరియల్ బాగున్నది. ముఖ్యమంత్రి గారి జాతకం మమ్మల్ని ఎంతో ఆకట్టుకున్నది -"

-యం. చంద్రశేఖర్, సత్తెనపల్లి

"శ్రీవాణి ఉత్తమ సాహిత్య రాజకీయ సాంఘిక పత్రికగా రూపొందుతోందని అనిపించింది. మీ ఆశయాలు, అభిప్రాయాలు నిక్కచ్చిగా తెలుపుతూ వెలువడుతున్న 'శ్రీవాణి' మీ వాణికి ధ్వనీ ప్రతిధ్వనీ కావాలని ఆశిస్తున్నాను"

-డా॥ కొలకలూరి ఇనాక్, అనంతపురం

## పోస్టల్ మిత్రులారా!

ఏప్రియల్ సంచిక మన రాష్ట్రంలోని కొంతమంది ప్రముఖులకు అందలేదని సమాచారం వచ్చింది. బందరు పట్టణ పుర ప్రముఖులలో కొంతమందికి శ్రీవాణి అందలేదని వ్రాయవలసి వచ్చినందుకు నిజంగా చింతిస్తున్నాను. అన్యధాభావించక 'శ్రీవాణి'ని సకాలంలో అందరికి అందజేయటంలో పోస్టల్ మిత్రులు సహకరిస్తారని ఆశిస్తున్నాను.

ధన్యవాదములు -సం.

"శ్రీవాణి పత్రిక చాలా బావుంది. శీర్షికలు చక్కగా వున్నాయి."

– కె. వసుంధరాదేవి, కపిలేశ్వరపురం

"స్వామీజీ ఫొటో చూచి పత్రిక కొని చదివాను. ఆర్టికల్స్ అత్యద్భుతంగా వున్నాయి."

– అదిభట్ల భాస్కరరావు, అనకాపల్లి

శ్రీవాణి పత్రికను ప్రారంభించి, మచిలీపట్నమునకు 'కృష్ణాపత్రిక' నాటి పేరు ప్రతిష్ఠలను గుర్తుకు తెస్తున్నారు. రాజకీయవిషయాలలో మీ నిష్పక్షపాత వైఖరి ప్రశంశనీయం. 'భారతదేశం' పార్టీస్థాపన అనాలోచితమని నిర్మొహమాటంగా చెప్పినందులకు మీ దూరదృష్టికి సంతోషిస్తున్నాను."

– అడవి వెంకటేశ్వరరావు, కైకలూరు

"శ్రీవాణి ప్రతి నెలలోను ఏవో ఒక కొత్త తరహాను పలువిధములయిన మహామహులైన రచనలద్వారా సంతరించుకొని పాఠకుల అభిరుచులను ద్విగుణీకృతం చేస్తున్నది."

– పంగనామముల రామమోహనరావు, సికింద్రాబాద్

"ఏప్రియల్ సంచిక ముఖచిత్రం బాగుంది. మీ అభిరుచికి, మీ చిత్తసంస్కారానికి, మీ విశిష్ట వ్యక్తిత్వానికి దర్పణంగా నిలిచింది ఆ ముఖచిత్రం. ఇది అతిశయోక్తి కాదేమో! అక్షరాల నిజం"

-దూర్జటి వెంకట బాలాజి, కావలి

"శ్రీవాణి సంచికలు చాలా ముచ్చటగా వున్నాయి. మంచి సాహిత్యానికి మంచి రోజులు వచ్చినట్లున్నాయి."

– హితశ్రీ, తెనాలి.

"సాంస్కృతిక మాసపత్రికను ప్రచురించడం కత్తిమీద సాము చేయడం వంటిది. ఇంత సాహసం చేస్తున్నందుకు అభినందనలు."

– ఎ. సూర్యప్రకాశ్, ఆర్మూర్

"ఏప్రియల్ శ్రీవాణి లో రామాయణం గురించి ఒక పుస్తకం ప్రచురించినట్లుగా వ్రాసారు. చాలా బాగున్నది. సాహిత్యపత్రికను నిర్వహించుట కష్టమని నేనెరుగుదును."

– వేదుల మీనాక్షీదేవి, రాజమండ్రి

మే - 1985

సంపుటి 1

సంచిక 5


# త్రివేణి

సాంస్కృతిక మాసపత్రిక


సంపాదకుడు-కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్

కొమరగిరి చంద్రశేఖర్

24-51 రామానాయుడుపేట

మచిలీపట్నం-521 001

ఫోన్ : 2818

చందా వివరాలు

విడిప్రతి : రు. 2-50

సంవత్సర చందా : రు. 27-00

జీవిత సభ్యత్వం : రు. 500-00

EDITED, PRINTED & PUBLISHED BY

**Komaragiri Krishna Mohan Rao**

Printed at

SPANDANA PRINTERS
MACHILIPATNAM

on behalf of

Triveni Publishers Pvt. Ltd.
Machilipatnam


## విషయ సూచిక



ఇంకా కవితలు, కార్టూన్లు, అభిప్రాయవేదిక ........

శ్లో॥ గభీరే కాసారే విశతి విజనే ఘోరవిపినే
విశాలే శైలేవా భ్రమతి కుసుమార్థం జడమతిః
సమర్ప్యైకం చేతస్సరసిజ ముమానాథ భవతే
సుఖేనావస్థాతుం జన ఇహ నజానాతి కిమహో!

(ఆదిశంకరులు)

# అమృతవాణి

## కూచిభొట్ల చంద్రశేఖరశర్మ

పరమాత్మను తెలుసుకొనేందుకు శాస్త్రాలు ఉపనిషత్తులు మొదలైనవి అనేక మార్గాలు చూపెట్టాయి. అవి కర్మ భక్తి జ్ఞానాదులు. ఏ మార్గంలో పయనించినా కావలసింది మనస్సు. ఈ మనస్సు పరిశుద్ధం కావటానికే యీ మార్గాలన్నీ. భగవంతుని తెలుసుకోటానికి చేసే ప్రయత్నాల్లో మనశ్శుద్ధి ముఖ్యమైన మజిలీ. ఏ మార్గమైనా యీ మజిలీ చేరేటంత వరకే. తరువాత అన్నీ ఒకే రాజమార్గమై గమ్యం చేరుస్తాయి.

ఈ కేంద్రానికి చేరేదాకా ధ్యానమనీ, తపస్సనీ, తత్త్వవిచారమనీ, పూజాపురస్కారాలనీ ఏవేవో తంటాలు పడతాడు మనిషి.

అయితే ఏ పని చేసినా భక్తి అనే భగవద్విషయమైన గాఢప్రేమ అందరికీ కావలసిన ప్రధాన విషయం. ఈ భక్తి అన్ని మార్గాల వారికీ వుండినప్పుడే ఆ మార్గం వెలుగు బాట అవుతుంది.

ఎంత కఠిన చిత్తాన్ని సైతం మెత్తపరచే గుణం, ఆర్ద్రం చేసే శక్తి భక్తికే వుంది.

భక్తి మార్గంలో భక్తుడు భగవంతునికి చేసే పూజా పురస్కారాలు కన్నులపండుగ్గా వుంటాయి. మనస్సుకు ఒక అహ్లాదాన్ని ప్రశాంతభావాన్ని ప్రసాదిస్తాయి. అందుచేత రకరకాల పూలతో భగవన్మూర్తినలంకరించి ఆనందపడతాడు భక్తి గల మనిషి.

నిజమే కాని యీ పూలను సంపాదించేందుకు తాను మునిగి పోయేటంత లోతైన సరస్సుల్లో చెరువుల్లోను దిగుతాడు. లక్షల కొద్దీ పూలు పత్రాలు తెచ్చి అర్చించటానికి భయంకరమైన నిబిడారణ్యాల్లో కూడా ప్రవేశించి తిరుగుతాడు. పెద్ద పెద్ద కొండలెక్కి వేయి కళ్ళతో వెతుకుతాడు పూల కోసం. ఇలా చేసే పద్ధతి అంత వివేకంతో కూడినది కాదంటారు జగద్గురువులు శంకరాచార్యస్వామి.

పాపం యీ తెలివి తక్కువ మనిషి పూల కోసం అనవసరంగా శ్రమపడి తిరగరాని చోట్ల తిరుగుతున్నాడే! అని జాలి పడ్డారు శంకరులు.

ఎందుకంటే యెంత తెలివిమాలినవాడు కాకపోతే యీ మనిషి తన దగ్గరే వున్న అద్భుత మైన పుష్పాన్ని పరమేశ్వరునికి సమర్పించటం మానేసి యెందుకు వృథాగా పిచ్చెక్కినట్లు అటు—ఇటు తిరుగుతాడు? అంటారు ఆచార్యస్వామి.

అందుకే సుళువైన మార్గం చెప్పి మనిషి సుఖపడే సలహా యిచ్చారు జగద్గురువులు. మనస్సనేదే ఒక పెద్ద పుష్పం. తనలోనే వున్నయీ హృదయకుసుమాన్ని భగవంతునికి సమర్పించటమే ప్రధానం కాని చెట్లు చేమలు తిరిగి కొండలు కోనలు గాలించి తెచ్చిన పూలు కాదు.

అంటే భగవంతునియందు మనసు నిలిపితే చాలు, అన్నీ చేసినట్లే, అలా చేయలేని వారు ఎన్ని గంపల పూలతో అర్చించినా ప్రయోజనం శూన్యమని యీ శ్లోకంలో బోధించారు ఆది శంకర భగవత్పాదులు.

కనుకనే "చిత్తశుద్ధి లేని శివపూజలేలయా" "భక్తిలేని పూజ పత్రి చేటు" అని వేమన అన్నాడు. పాత్రశుద్ధి లేని పాకం వ్యర్థమైనట్లే ఆ పూజలు పనికి రావనేగాని శివ పూజలు కూడదన లేదు. సర్వవేళలా ప్రహ్లాదుడు మనస్సు భగవంతునియందుంచినట్లు మనం కూడా మనసు నిలిపి భగవంతుని సేవించాలని భావం. ★

# సంపాదకీయం

విద్యా విధానంలో సమగ్రమైన మార్పులు రావాలని స్వాతంత్ర్యం సిద్ధించిన దగ్గరనుంచి పెద్దలుచెబుతూనే వున్నారు. అయితే స్వాతంత్ర్యం వచ్చి 39 సంవత్సరాలు కావస్తున్నప్పటికి మార్పులు రాకపోగా, ఈ సమస్య మరింత జటిలంగా మారుతుండటం శోచనీయం. "నేటి విద్యకు, జీవితావసరాలకు ఏమీ సంబంధం వుండటంలేదు. సాంఘిక పరిస్థితులకు ఏ మాత్రం అది అనుకూలంగా లేదు. కనుక ప్రస్తుత విద్యాస్వరూపాన్ని, విధానాన్ని మార్చ వలసి వున్నది. నేనాశిస్తున్న సంపూర్ణ విప్లవంలో ఒక భాగం విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పు" అని లోకనాయక్ జయప్రకాశ్ ఏనాడో స్పష్టంచేసారు. 1976 నవంబరులో మాజీ కేంద్ర విద్యాశాఖామంత్రి ప్రొ॥ నూరుల్ హసన్ 'సామాజికమైన మార్పుకు విద్య ఒక మార్గం' అను అంశంపై హైదరాబాదు అడ్మినిస్ట్రేటివ్ స్టాఫ్ కాలేజిలో మాట్లాడుతూ "దేశంలో కొంతమంది ఉన్నత వర్గాలవారికి మాత్రమే ఉపయోగపడుతున్న ఈ విద్యావిధానంలో మార్పులు తీసుకొనివచ్చి, ప్రస్తుత పరిస్థితులకనుగుణంగా విద్యావ్యవస్థను రూపొందించాలి" అని పేర్కొన్నారు. 1976 నవంబరులో మాజీ ఉపరాష్ట్రపతి శ్రీ బి. డి. జెట్టి పూనాలో జరిగిన సెమినార్‌లో మాట్లాడుతూ "ప్రస్తుత విద్యావ్యవస్థలో సంపూర్ణమైన మార్పు రావాలి" అని అన్నారు. 1975లో సేవాగ్రాంలో జరిగిన అఖిలభారత బేసిక్ విద్యాసభలో "సెకండరీ విద్య గాంధేయ పద్ధతులలో బోధించబడాలి. అది ఉత్పాదక శక్తిని పెంపొందించేదిగాను, సమాజ అవసరములకు ఉపయోగపడేదిగాను ఉండాలి" అని తీర్మానించారు. ఈమధ్య జాతీయ విద్యా పరిశోధనా శిక్షామండలి ఢిల్లీ ప్రాంతంలోని విద్యార్థులలో సర్వే జరుపగా ఎక్కువమంది విద్యార్థులు "విద్యతోపాటు హైయర్ సెకండరీ స్థాయిలోనే వృత్తి విద్యకు సంబంధించిన కోర్సులను నడపాలి" అని అభిప్రాయపడినట్లు వెల్లడైంది. మాజీ ప్రధానమంత్రి శ్రీ మురార్జీ "మనిషిని దోపిడీ నుంచి కాపాడేది విద్య" అని పేర్కొన్నారు. మాజీ విద్యాశాఖామంత్రి 1977లో "తమ ప్రభుత్వం ప్రాథమిక విద్యను సార్వజనీనం చేయగలదు. వయోజన విద్యా వ్యాప్తికి అత్యధిక ప్రాధాన్యత యిస్తుంది" అనిచెప్పారు. స్టాక్‌హోం విశ్వ విద్యాలయ ప్రొఫెసర్ గున్నర్ మిర్దాల్ (నోబుల్ బహుమతి పొందారు) 1972 జనవరిలో ఢిల్లీకి వచ్చినప్పుడు" హిందూస్థాన్ టైమ్స్" కు యిచ్చిన ఇంటర్వ్యూలో "భారతదేశపు విద్యలో అధిక భాగము అభివృద్ధికి వ్యతిరేకమైనది. 'నీవు చేతులు మట్టి చేసుకోవద్దు' అనే మనస్తత్వాన్ని అది పెంచుతున్నది" అని స్పష్టం చేసారు. "ప్రస్తుత విద్యావిధానం, పరీక్షల పద్ధతులలో తీవ్రమైన మార్పులు తక్షణమే ప్రవేశ పెట్టవలసిన అవసరం వున్నది" అని ఆంధ్రా యూనివర్సిటీ వైస్ ఛాన్సలర్ శ్రీ కె. రామకృష్ణారావు పేర్కొన్నారు. 1986-87 విద్యాసంవత్సరం నుంచీ "నూతన విద్యా విధానానికి రూపకల్పన" చేయబోతున్నట్లుగా కేంద్రప్రభుత్వం ప్రకటించింది. ప్రధానమంత్రి శ్రీ రాజీవ్ గాంధీ, ముఖ్యమంత్రి శ్రీ యన్. టి. రామారావులు కూడా' విద్యా విధానంలో మౌలికమైన మార్పులు రావాలి. వృత్తి విద్యా కోర్సులకు ప్రాధాన్యత యిచ్చేట్లుగా విద్యాస్వరూపాన్ని మార్చాలి" అంటూ ప్రకటనలు చేస్తున్నారు. ఇలాంటి ప్రకటనలు ప్రభుత్వంలో వున్నవారు, బయట మేధావులు ఎంతోకాలం నుండి చేస్తూనే వున్నారు. వ్యవస్థలో మాత్రం మార్పు రావడంలేదు, ప్రాథమిక విద్య విషయం మొదటికి వచ్చింది. 1960 నాటికే ఈ విద్యాదశను ఆదిలో పూర్తి చేయాలనుకున్నారు. కాని కాలక్షేపం మాత్రం జరిగింది. పని మాత్రం పూర్తికాలేదు. 1989-90 నాటికి ప్రాథమిక విద్యావ్యాప్తి దేశంలో పూర్తి అవుతుందని ఇప్పుడు చెబుతున్నారు. బాల బాలికల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. వ్యవస్థ దిగజారిపోతున్నది. ఇప్పటికైనా ఈ విషయంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తగు శ్రద్ధ వహించాలి. ప్రతి రాష్ట్రంలోను మేధావుల సెమినార్లు జరపాలి. ఉపాధ్యాయ, విద్యార్థుల సభలు జరపాలి. వారి అభిప్రాయాలను కూడా క్రోడీకరించి ఒక 'సమగ్ర విద్యా విధానము' ను రూపొందించి ఎట్టి జాప్యం లేకుండా అమలు పరచాలి. ఇది చేయకుండా ఏక పక్షంగా ప్రభుత్వం నిర్ణయాలను గైకొంటే ఆశించిన ఫలితం చేకూరకపోగా, ప్రభుత్వ ప్రయోగాలకు మరొక పర్యాయం విద్యార్థులు బలి కావలసివస్తుంది. విద్యారంగంలో అశాంతి చెలరేగుతుంది. దేశం సంక్షోభంలో పడుతుంది. ★

# ధర్మరాజ్యం

“ధర్మరాజ్యము ( Rule of law )ఏ ఒక్క వ్యక్తిని గాని, ఏ ఒక్క వ్యవస్థనుగాని సర్వోన్నతము(Soverign) గా భావించదు. ధర్మరాజ్యమందు ప్రతి వ్యక్తి కొన్ని కర్తవ్యములకు, కట్టుబాట్లకు బద్ధుడు. పరిపాలనా యంత్రాంగము (Executive ) యొక్కయు, శాసనసభల (Legislative) యొక్కయు, హక్కులు (Rights), ధర్మముచే నిర్వచించబడి, ధర్మమునకు లోబడివుంటాయి. విశృంఖల భావప్రకటన, అదుపూ ఆజ్ఞ లేని స్వేచ్ఛా ప్రవర్తన, ధర్మరాజ్యమందు అంగీకరించబడవు. ధర్మరాజ్యము నిరంకుశత్వపు ఛాయలనైనను దరి చేరనీయక, ప్రజాస్వామ్య వ్యవస్థ పతనమై గుంపురాజ్యం (Mobocracy) గా దుష్పరిణామము నుండి రక్షణ కల్పించుతుంది. మిగిలిన రాజ్యవ్యవస్థలు హక్కు యుక్తముగా (Rights orientated) రచింపబడినవి. ధర్మరాజ్యము మాత్రం కర్తవ్యయుక్తము (Duties orientated) గా రూపకల్పన చేయబడినది. ఇందువలన ఈ హక్కులు భుక్తము గావింపబడు ప్రమాదం గాని, లేదా సర్వవిధములైన హక్కులు మాకే కావలెననే అత్యాశ గాని కలిగే అవకాశము లేదు. అలాగని కర్తవ్య నిర్వహణలో నిర్లక్ష్యత లేదా అధికార వ్యామోహము, హక్కుల మధ్య ఘర్షణ (Conflict of Rights) మొదలగు వాటి ప్రమాదం ధర్మరాజ్యమందు లేదు. ధర్మరాజ్య మందు ప్రజల హక్కులను ఎవరైనాసరే అతిక్రమించరాదు. ఈ హక్కులను రక్షించుకొనుట ప్రజల యొక్క కర్తవ్యము. మన దృక్పథంలో నిజానికి ప్రజలకు ఈ హక్కులు తమ కర్తవ్య పాలనకు ఉపయోగపడే సాదనములు మాత్రమే. హక్కు (Right) మరియు కర్తవ్యము ( Duty ) అనునది ఒక త్రిభుజము యొక్క రెండు భుజములు. ధర్మము దాని యొక్క ఆధారము ( Base ). ఉదా = అవసరమైన తగిన ఆయుధములను చేత ధరించుట సైనికుని హక్కు (Right). ఎందుకంటే ఆయుధములు లేకుండా దేశరక్షణ అనే తన కర్తవ్యము ( Duty ) ను అతను నిర్వహించ లేడు. ఎలా ఈ ఆయుధములను సమకూర్చ వలెను. వాటిని ఏ విధంగా ఉపయోగించవలెను అన్న విషయములు ధర్మము (Rule of law)చే నిర్ణయించబడుతాయి.”

-పండిట్ దీనదయాళ్ ఉపాధ్యాయ

# ఆంగ్లేయులను గడగడలాడించిన

# విప్లవ వీరం భగత్ సింగ్

"సైమన్ గోబ్యాక్! సైమన్ గోబ్యాక్!" అంటూ లాహోర్ మహానగరం మారు మ్రోగింది. ఆనాడు జరిగిన బ్రహ్మాండమైన ప్రజా ప్రదర్శనకు శ్రీ లాలా లజపతిరాయ్, కాశీ హిందూ విశ్వ విద్యాలయ వ్యవస్థాపకులు శ్రీ మదనమోహనమాలవ్యా ప్రభృతులు నాయకత్వం వహించారు. విప్లవ వీరు లెందరో పాల్గొన్నారు. "సైమన్ హటావ్," "సైమన్ హటావ్" అంటూ తాళం వేస్తూ, ఆ తాళానికి సరీగా అడుగులు వేస్తూ, నృత్యం చేస్తూ జనం సైన్యంలా నడువసాగింది. "భారత మాతాకీ జై" అనే నినాదాలు ప్రతిధ్వనించాయి. "వందే మాతరం" నినాదం మిన్ను ముట్టింది.

## సైమన్ కమిషన్

భారతదేశంలో రాజ్య వ్యవస్థను పరిశీలించి బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపన ఎంతవరకు అవసరము, సాధ్యం అను అంశంపై బ్రిటీష్ ప్రభుత్వానికి నివేదిక సమర్పించడానికి 'సర్ జాన్ సైమన్' అధ్యక్షతన ఒక కమీషన్ వేయబడింది. ఈ కమీషన్‌లో వున్న ఏడుగురు సభ్యులు ఆంగ్లేయులే కావడంవలన, న్యాయం చేకూరదని భారతజనత భావించింది. మహోద్యమం చెలరేగింది. 'సైమన్ కమీషన్' రైలులో లాహోర్ వస్తున్నదని తెలిసి అక్టోబరు 20వ తేది (1928 సం)న లాలాజీ నేతృత్వంలో బయలు దేరిన ఆ జనసందోహం స్టేషన్ వైపు నడిచింది. సహనాన్ని కోల్పోయిన ప్రజలు, స్టేషన్ రోడ్డులో అడ్డం కట్టిన ముళ్ళ తీగెలను లాగివేసి, "సైమన్ గోబ్యాక్" "సైమన్ హటావ్" అంటూ బిగ్గరగా నినాదాలు చేస్తూ స్టేషన్ వైపుకు నడువ సాగారు. పోలీసులకు ఏమి చేయాలో తోచలేదు. ఆ మహా ప్రవాహాన్ని ఎదుర్కొనడం దుర్లభమని భావించి "ప్రజలారా చెదిరిపోండి" అని పోలీసులు హెచ్చరిక వేసారు. ఆ హెచ్చరికను ప్రజలు ఏమాత్రం లెక్క చేయలేదు. పోలీసు సూపరింటెండెంట్ 'స్కాట్' నోటనుండి "ఛార్జ్" అనే ఆజ్ఞలు వికృతంగా వినిపించాయి. మరుక్షణం లోనే పోలీసులు విలయ తాండవం చేసారు. అమానుష హింసాకాండ ప్రారంభమైంది. లాఠీలు స్వైర విహారం చేసాయి. అమాయక ప్రజల మీద లాఠీల వర్షం కురిసింది. చేతులు, కాళ్ళు విరిగాయి. తలలు బ్రద్దలయినాయి. రక్తం ఏరులై పారటం ప్రారంభించింది. అయినప్పటికి ప్రజలు ప్రశాంతంగా "సైమన్ గోబ్యాక్" సైమన్ హటావ్" అంటూ నినాదాలు చేస్తూ నిశ్చేష్టులై నిలబడిపోయారు.




## లాలాజీ మీద అఘాయిత్యం

వృద్ధనాయకుడు లాలాజీ మీద పోలీసుల క్రూరదృష్టి పడింది. 'లాలాజీని పట్టుకోండి' అని స్కాట్ హుంకరించాడు. అసిస్టెంట్ సూపరింటెండెంట్ 'స్యాండర్స్' నాయకత్వంలో ఒక పోలీసుదళం లాలాజీ మీదకు దుముకబోతున్నది. అది చూచిన భగవతీచరణ్, సుఖదేవ్, యశపాల్ మొదలగు విప్లవవీరకిశోరాలు లాలాజీకి వలయం కట్టారు. లాలాజీకి ఎండ తగలకుండా అడ్డం పెట్టిన గొడుగు మీద 'స్యాండర్స్' పొడుగు లాఠీ విరుచుకపడింది. గొడుగు విరిగిపోయింది. వలయాకారం పట్టిన వీరకిశోరాల మీద

ప్రజాపీడకులారా! జాగ్రత్త!

మీ పై శాచిక హస్తాలను దూరముంచండి. జాగ్రత్త! మీ కరాళ శాసనాలవల్ల మమ్మ లను నిరాయుధులుగా చేయడానికి మీరెంత అవస్థ పడినప్పటికీ ప్రయోజనం శూన్యం. మమ్మల్ని అణగద్రొక్కడానికి ప్రయత్నాలు జరుగుతూ వున్నప్పటికీ మా విప్లవ ఘోష ఏమాత్రం తగ్గదు. బాగా జ్ఞాపకముంచు కోండి! ఉరిత్రాడు మా కంఠానికి చుట్టిన ప్పుడుకూడా 'విప్లవం వర్ధిల్లాలి' అనిమాత్రమే సంతోషంగా ఘోషిస్తాం.

మానవ రక్తాన్ని చిందించవలసి వచ్చి నందుకు మాకు నిజంగా దుఃఖంగానే ఉంది. అయితే మా ప్రియతమ నాయకుణ్ణి (లాలా లజపతిరాయ్) పొట్టన పెట్టుకున్న నరరూప రాక్షసికి జరగవలసినదే చేసాం. మానవుని చే మానవుని శోషణను తుదముట్టించడానికి విప్లవరంగంలో రక్తతర్పణ అనివార్యం.

"విప్లవం వర్ధిల్లా!

ది 18-12-1928 సం. బలరాజ్
(అసలు పేరు : చంద్రశేఖర ఆజాద్)
(స్యాండర్స్‌ను చంపిన తరువాత
వెలసిన వాల్‌పోస్టర్లు)

వందలాది లాఠీలు ప్రయోగించబడ్డాయి. తలలు పగిలాయి. రక్తం చిమ్మింది. లాలాజీ మీద కూడా దెబ్బపై దెబ్బ పడింది. ఆయన దేహం నుండి కూడా రక్తం కారడం మొదలైంది. రొమ్ముపై బలమైన లాఠీ దెబ్బ పడింది. 'లాలాజీ' కుప్పగా కూలిపోయారు. ప్రజలను చెదిరి పోండని లాలాజీ హెచ్చరించారు. విరిగిన కాళ్లు చేతులు, చెదిరిన జుట్టు, పగిలిన తలలు, చిరిగిన శరీరాలు చినిగిన చొక్కాలతో ప్రజలు ఇంటి ముఖం పట్టినప్పటికీ, పోలీసులు లాఠీలతో తరుముతునే వున్నారు.

## లాలాజీ మరణం

లాహోర్ అంతటా స్మశాన నిశ్శబ్దం ఆవరించింది. పోలీసుల అకృత్యాలకు నిరసనగా సంపూర్ణ హర్తాళ్ జరిగింది ఆ రోజు సాయంత్రం జరిగిన నిరసన. బహిరంగ సభకు వేలాది మంది ప్రజలు విచ్చేసారు. కట్టు కట్టుకొని లాలాజీ వేదిక మీదకు రావడంతోనే హర్ష ధ్వానాలు మిన్నుముట్టాయి. తమ ప్రియతమ నాయకుని ఆ స్థితిలో చూడవలసి వచ్చినందుకు ప్రజల కంటి వెంబడి కన్నీరు కారింది. పంజాబు కేసరి లేచి "నిరపరాధ ప్రజలపై దాడిచేసే ప్రభుత్వాన్ని; నాగరిక ప్రభుత్వం అని పిలువడానికి ఎలాంటి హక్కు లేదు" అని గర్జించాడు. వేదిక ప్రక్కనే నిలిచి తిరస్కారభావంతో, అహంభావంతో వికటాట్టహాసం చేస్తూ నిలబడిన డిప్యూటీ సూపరింటెం డెంట్ 'నీల్' వైపు చూచి లాలాజీ ఇంగ్లీషులో "జ్ఞాపక ముంచుకో! నన్ను కొట్టిన ప్రతి లాఠీ దెబ్బ భారతదేశంలో ఆంగ్లేయుల పరిపాలన యొక్క శవపేటికపై కొట్టబడిన చివరి మేకులవుతాయి. జాగ్రత్త!" అని సింహగర్జన చేస్తాడు. లాలాజీ ఆరోగ్యం నానాటికి క్షీణించి పోతుంటుంది. 1929 నవంబరు 17 న పంజాబు సింహం కన్ను మూస్తుంది. స్యాండర్స్ దెబ్బలే లాలాజీ మరణా నికి కారణమని వైద్యాధికారులు ప్రకటిస్తారు.

## బసంతీదేవి గర్జన

లాలాజీ శవయాత్రంలో కనీవిని ఎరుగని జనం పాల్గొం టారు- నాయకులు, విప్లవ వీరులు ఎందరో ఆ అంతిమ యాత్రలో నడుస్తారు. లాలాజీ మరణంతో ముఖ్యంగా యువతలో ఉద్వేగంతో పాటు సవాలును స్వీకరించాలనే పట్టుదల పెల్లుబుకుతుంది. దెబ్బకు దెబ్బ తీయాలనే

కోరిక ప్రబలుతుంది. పగబట్టిన బెబ్బులిలా సమయం కోసం విప్లవ వీరకిశోరాలు పొంచి చూస్తుంటాయి. దీనికి తోడు లాలాజీ మరణవార్త విని దేశబంధు చిత్తరంజన్ దాస్ సతీమణి 'బసంతీదేవి' లాహోర్ వచ్చి ఒక సంతాప సభలో మాట్లాడుతూ "లాలాజీ మరణం భారతీయ యువతలో ఆత్మగౌరవం నశించడానికి చిహ్నం. ఈ దేశంలో పురుషత్వం, యౌవనం ఇంకా జీవించే వున్నాయా ? మన ప్రియతమ లాలాజీ చితిమంటలు చల్లారేలోపుగానే దీనికి యువలోకం జవాబు చెప్పాలి" అని ప్రళయకాల రణచండికలాగా గర్జిస్తుంది. బసంతీదేవి చేసిన ప్రసంగాన్ని భారతయువత సవాలుగా స్వీకరిస్తుంది.

## రహస్య సమావేశం

డిశంబరు 10న లాహోర్‌లోని "బోర్డింగ్ హౌస్"లో విప్లవ వీరులు రహస్య సమావేశం జరుపుతారు. దీనిలో చంద్రశేఖర్ ఆజాద్, భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురు, మహావీరసింహ, కైలాసపతి, కందన్‌లాల్, యశపాల్ ప్రభృతులు పాల్గొంటారు. కోపోద్రిక్తుడైన భగత్‌సింగ్ ఉద్రేకపూరితమైన ఉపన్యాసం చేస్తాడు. "లాలాజీ మరణం జాతికే తీరని అవమానం. జాతికి జరిగిన ఈ అవమానాన్ని తొలగించడం విప్లవకారుల తక్షణ కర్తవ్యం. విప్లవ కారులకు పగ తీర్చుకొనే సామర్థ్యం, శక్తి, ధైర్యం, చైతన్యం వున్నదని ప్రపంచానికి తెలియజెప్పాలి. తెల్ల దొరల తుపాకీ గుండ్లకు, మరఫిరంగుల శబ్దాలకు భారత యువత ఏమాత్రం చలించదని నిరూపించాలి. దెబ్బకు దెబ్బ తీయగల శక్తి, సామర్థ్యం విప్లవ వీరులకు కలదని ఋజువుచేయాలి." అని భగత్‌సింగ్ చేసిన ఉద్రేకపూరితమైన ఉపన్యాసం విప్లవకారులను కదిలించి వేసింది. "వందేమాతరం" అనే నినాదం మారుమ్రోగింది.

## స్యాండర్స్ హత్య

లాలాజీ మరణం నవంబరు 17న జరిగింది. మాసిక తిథి డిశంబర్ 17న ఒకపథకం ప్రకారం పోలీస్ స్టేషన్

---

పూజ్యులు తండ్రి గారికి.

"నన్ను లాహోర్ కుట్రకేసు నుంచి తప్పించేందుకు స్పెషల్ ట్రిబ్యునల్‌కి మీరు ఓ అప్పీలు పెట్టారని తెలిసి చాలా ఆశ్చర్య పోయాను. మీ ఈ చర్య నన్నెంతగానో వ్యధలో ముంచివేసింది. ఈ విషయం తెలిశాక నాకు మనశ్శాంతి పూర్తిగా కరువైంది. మీ కొడుకు నయినందుకు తండ్రిగా మీ ఆశల్ని, ఆకాంక్షల్ని గౌరవిస్తాను. అయితేదానితో పాటుగానే నాతో ముందుగా ఆలోచించకుండా నా విషయంలో ఎలాంటి అప్పీలు ఇచ్చే అధికారం మీకు లేదని కూడా నేను భావిస్తున్నాను నాతో ముందుగా ఎలాంటి ఆలోచన చేయకుండానే నా తరుపున ఇలాంటి ప్రయత్నం చేయడం సమంజసం కాదు. మీరనుకుంటున్నట్లుగా (నాదృష్టిలో) నా జీవితం అంత విలువైనది కాదు. సిద్ధాంతాలను సైతం బలి పెట్టేంత విలువైనది కాదు నా జీవితం..

మీ జీవిత సర్వస్వాన్ని భారతదేశ దాస్య విముక్తికై బలిపెట్టారని నాకు తెలుసు. కాని ఇలాంటి మహత్తరమైన తరుణంలో మీరు ఇలాంటి బలహీనతను ఎలా చూపించారో నా కయితే అంతు పట్టటం లేదు. మీకుబదులు మరొక వ్యక్తి ఎవరైనా ఇలా చేసివుంటే, అతణ్ణి నేను దేశద్రోహి కన్నా తక్కువగా భావించేవాడిని. అయితే మీపై అలాంటి పద ప్రయోగం చేయలేను. నాన్నగారూ ! ఈ విషయం నా మనస్సు నెంతగానో కలిచి వేస్తున్నదండీ ! చివరిగా మీకూ, నా ఇతర మిత్రులకూ, ఈ కేసులో సానుభూతిని చూపిస్తున్న అందరికీ చాలా స్పష్టంగా ఒక విషయం చెప్పదలిచాను. మీరు చేసిన ఈ పనిని నేను సదభిప్రాయంతో చూడటం లేదు. ఈనాడు కూడా నిర్దోషినని కోర్టు ముందు వాఙ్మూలం యిచ్చి ఏదో విధంగా బయట పడాలనే కోరిక నాకు ఏమాత్రం లేదు. అప్పీలు చేస్తే, ఉరిశిక్షను, యావజ్జీవ కారాగార శిక్షగా తగ్గించవచ్చు. దాంతో విప్లవంలో తీవ్రత క్షీణిస్తుంది. ఈ సమయంలో దేశంలో విప్లవాగ్ని చల్లారకుండా వుండాలంటే ప్రాణత్యాగం చేయడం ఒకటే ఉత్తమ మార్గం

మీ సేవకుడు

—భగత్‌సింగ్



"పరిపాలనను సంస్కరించే ముసుగులో ఆంగ్ల ప్రభుత్వం తన చేతిలోనున్న దౌర్జన్య పూరిత యంత్రాంగానికి మరింత బలం చేకూర్చడానికి వ్యాపార వివాదాల బిల్లు, ప్రజారక్షణ బిల్లులను తీసుకొని వచ్చిందని భావిస్తున్నాము. ఇంతకంటే భయంకరమైన 'పత్రికా రాజద్రోహపు బిల్లు' తరువాత వచ్చే సభలో ప్రవేశపెట్టే సూచనలు కనిపిస్తున్నాయి. ఎన్నికైన ప్రతినిధులకు మేము మనవి చేసుకొనేది ఒకటే. 'మీరు ఈ పార్లమెంటు బంధనాలనుండి విముక్తులై, మీ కార్య క్షేత్రాలకు వెళ్ళి ప్రజా శక్తిని, ఈ పరకీయ డంబాచారాలకు వ్యతిరేకంగా మేలు కొలిపి నిలపండి' ఈ దౌర్జన్య పూరితమైన బిల్లులను, లాలాజీ ఘోరహత్యను ప్రతిఘటించ డానికే మేమిక్కడ బాంబులను వేశాం. మేము మానవ రక్తం పవిత్రమైనదని భావిస్తాం. ప్రతియొక వ్యక్తికీ సంపూర్ణ స్వాతంత్ర్యం, శాంతి లభించగల భవ్యమైన భవిష్యత్తులో మాకూ నమ్మకం వుంది మానవరక్తాన్ని చిందింప చేయవలసి రావటం మాకు నిజంగా దుఃఖాన్ని కలిగిస్తోంది. అయితే అందరికీ సమానంగా స్వాతంత్ర్యాన్ని లభింప చేయడానికి కొంత రక్తపాతం కాక తప్పదు మా కార్యం యొక్క ఉద్దేశాన్ని, ఆవశ్య కతను వివరించి చెప్పాలంటే సుప్రసిద్ధ వ్యక్తి 'బ్యూరో' మాటలలోనే అది సాధ్య మవుతుంది."

"చెవిటివాణ్ణి మేల్కొల్పాలంటే నిరంత రంగా, భయంకరంగా ప్రేలుళ్ళు అవసరం."

(సం) బలరాజ్ (ఆజాద్ మారుపేరు)

(శాసనసభలో భగత్‌సింగ్ ప్రభృతులు విసిరిన కరపత్రం సారాంశం)



ముందు గేటు వద్దనే 'స్యాండర్స్'ను భగత్‌సింగ్, రాజ గురులు కాల్చి చంపారు ఈ దేశానికి అవమానం కలిగించే వారికి జరిగే శాస్తి యిదేనని చేసి చూపించారు. ఆ వార్త వినిన "స్కాట్"కు వణుకు పుట్టింది. నెల రోజుల దాకా బయటకు రాలేదు. "స్యాండర్స్ చచ్చాడు, లాలాజీ పగ తీరింది" అనే నినాదాలు లాహోర్ గోడలమీద ప్రత్యక్ష మయినాయి. యావత్ భారతవర్షం సంతోషించింది. యువత ఆనందోల్లాసాలకు అవధులు లేకుండా పోయింది. తమ ప్రాణాలను పణంగా పెట్టి భారతమాత మానరక్షణ కోసం ఎలాంటి త్యాగాలైనా చేయడానికి భారత యువశక్తి కదం త్రొక్క నారంభించింది. భారతజాతి గౌరవాన్ని రక్షించడానికి, భారతీయుల శక్తి సామర్ధ్యాలను నిరూపించ డానికి, క్రొవ్వెక్కిన పరదేశీ ప్రభుత్వానికి గుణపాఠం నేర్పడానికి భారత యువశక్తి విజృంభించింది.

## మారువేషాలలో ప్రయాణం

"స్యాండర్స్"ను హత్య చేసింది ఒక కేశధారి సిక్కు యువకుడని ఒక ఆచూకి ప్రభుత్వానికి తెల్సింది. దీని వలన భగత్‌సింగ్ దొరికి పోయే ప్రమాదం ఏర్పడింది. అయితే ఆజాద్ సూక్ష్మ బుద్ధి సునిసితంగా పనిచేసింది. ఆజాద్ సలహా ప్రకారం భగత్‌సింగ్ తల వెంట్రుకలు' గడ్డం తీసివేస్తాడు. ఆధునిక దుస్తులను ధరించి ఫెల్ట్ హ్యాట్ పెట్టుకొని కోర మీసంతో విప్లవ సోదరుడు భగవతీ చరణ్ ఇంటికి డిశంబరు 21వ తేదీ రాత్రి వెళ్ళి తలుపు తడతాడు. భగవతీచరణ్ రహస్య కార్య కలాపాలను కొనసాగించడానికి కలకత్తాకు అంతకు పూర్వమే వెళ్ళి పోతాడు. ఆ ఇంట్లో ఆయన భార్య "దుర్గాదేవి," మూడు సంవత్సరాల పసి బాలుడు మాత్రం వుంటారు. దుర్గాదేవి తలుపు తీస్తుంది. కొంచెం సేపటి వరకు గుర్తించదు. ఆజాద్ అంతకు పూర్వమే ఈ రహస్య మారువేషం విషయం చెప్పి వుండటం వలన మారువేషంలో వచ్చిన యువకుడు "భగత్‌సింగ్" అని, అతని వెంట కూలివాని వేషంలో వచ్చిన వ్యక్తి "రాజగురు" అని దుర్గాదేవి

గుర్తించి ఆనాటి రాత్రి వారికి ఆశ్రయమిస్తుంది. అజాద్ సలహా ప్రకారం అందమైన వేషం ధరించి భగత్ సింగ్ భార్యలా చంకన బిడ్డను పెట్టుకొని వెంబడిస్తుంది. ముగ్గురూ లాహోర్ స్టేషన్కు చేరుతారు. స్యాండర్స్ హత్య జరిగి అప్పటికి ఐదురోజులే కావడం వలన పోలీసుల నిఘా ఎక్కువగా వుంటుంది. అడుగడుగునా మారు వేషాలలో నున్న గూఢచారులు వచ్చేపోయే ప్రయాణీకులను పరిశీలిస్తుంటారు. అప్పటికే రిజర్వు చేయబడిన మొదటి తరగతి పెట్టెపైపెపుకు ఈ నూతన దంపతులు నడుస్తారు. వెంటనున్న కూలీవాడు మూడవ తరగతి పెట్టె ఎక్కుతాడు.

## శంభో శంకర-హర-హర-మహదేవ

శరీరమంతా విభూతి మయం, నుదుటిపై దట్టంగా విభూతి రేఖలు, వెడల్పాటి కుంకుమ బొట్టు, ఒంటిపై కాషాయరంగు దప్పటి, రుద్రాక్షమాలలు ధరించి "శంభో శంకర- హర-హర-మహదేవ" అంటూ శిష్యమండలితో సహా ఓ స్వామీజీ లాహోర్ స్టేషన్ ప్లాట్ ఫారం మీదికి వేంచేస్తారు. చుట్టూ చూడడానికి జనం చేరుతారు. రామనామ సంకీర్తన చేస్తూ, మధ్య మధ్యలో "శంభోశంకర-హర-హర-మహదేవ" అంటూ శ్రావ్యంగా గానం చేస్తుంటారు స్వామీజీ. శిష్యులు తాళం వేస్తూ పల్లవి సందుకుంటుంటారు. పోలీసులు; గూఢచారులు సహితం కళ్లప్పగించి చూస్తూ నిల్చిపోతారు. వీరిని చూచిన 'భగత్ సింగ్' ఆజాద్ ఈ వేషంలో తనను రక్షించే నిమిత్తం వచ్చాడని భావించి లోలోన సంతోషిస్తాడు. గార్డు విజిల్ వేసి పచ్చ జండా ఊపుతాడు. అందరూ రైలెక్కుతారు. మధ్యలో ఏదో ఒక స్టేషన్లో స్వామీజీ బృందం దిగిపోతుంది. కూలీ వేషంలో నున్న 'రాజగురు' కాన్పూర్ స్టేషన్లో దిగి జనంలో కలిసిపోతారు. అంతకు పూర్వమే అందిన సమాచారం ప్రకారం హౌరా స్టేషన్లో భగవతీచరణ్ సుసీలాదీదీలు నూతన వధూవరులకు స్వాగతం పలికి ఇంటికి తీసుకుని వెళ్లుతారు. భగత్సింగ్ను క్షేమంగా తీసుకొని వచ్చినందుకు భగవతీచరణ్ తన భార్య 'దుర్గాదేవి' ని అభినందిస్తాడు. వారు నిజంగా కారణ జన్ములే. భారతమాత దాస్య శృంఖలాలను త్రెంచి వేయడానికి అవతరించిన మహనీయులే. వారికి "నా" అనేది ఏమీలేదు. వారికి కావాల్సింది మనదేశం స్వాతంత్ర్యం

## "నేరం" అం

బాంబు కేసును విచారిస్తున్న సెషన్స్ జడ్జి ఒక పర్యాయం "సాధారణంగా, అపరాధానికి వెనుకగల ఉద్దేశ్యానికి ప్రాధాన్యత యివ్వం. అపరాధం గురించే ఆలోచిస్తాం" అన్నాడు.

వెంటనే భగత్సింగ్ ఇలా ఖండించాడు. "మనిషిని చంపడం రెండురకాలు. ఒక వ్యక్తిని చంపడమూ, యుద్ధరంగంలో అనేక మందిని చంపడమూ ఒక రకం చర్యే. కాని వ్యక్తిగత కారణాలతో ఒకర్ని చంపితే, దానిని హత్య అంటాం. యుద్ధంలో చంపితే వాటిని హత్యలవం. చంపే సేనానులను హంతకులనం."

"అలాగే-ఒకర్ని బెదిరించి జేబుకొట్టడమూ, పన్నులు వసూలుచేయడమూ అవతలివానిని నిర్ధనుణ్ణిచేసే క్రియే. కానీ మొదటివాడిని 'జేబుదొంగ' అంటాం. పన్నులు వసూలు చేసేవాడిని 'ఉద్యోగి' అంటాం."

"ఎలుకల్ని చంపడానికి అన్నంలో విషం కలిపితే నేరం కాదు. మనుషుల్ని చంపడానికి విషమిస్తే అది 'నేరం'."

ప్రియమైన కుల్తార్,

ఈరోజున నువ్వు నన్ను చూడటానికి వచ్చినప్పుడు నీ కళ్ళలో నీళ్ళు తిరగడం నన్ను అపరిమితంగా బాధించింది. నీ ముఖంలో విచారం కనిపించింది. గొంతులో శోకం వినిపించింది. నీలో ఇలాంటివి చూడటం నాకిష్టం లేదు. తమ్ముడూ! నీ చదువులు కొనసాగిస్తూ ధైర్యంగా నిన్ను నీవు సంబాళించుకో.

వ్యక్తిత్వాన్ని కోల్పోవద్దు; పిరికివి కావద్దు. ఇంతకంటే ఎక్కువ నేనేం వ్రాయగలను? ఇంకేం చెప్పగలను.

సోదరుడు

భగత్ సింగ్

పొందడమే. పరదేశీయుల్ని భారత ఖండము నుండి పారద్రోలడమే వీరి పరమావధి దీని కోసం, ఎంతటి త్యాగాలకైనా వారు సంసిద్ధమే. స్వసుఖాలను త్యజించి, మమకార బంధనాలను పటాపంచలు చేసిన త్యాగధను లెందరో ఈదేశ స్వాతంత్ర్య సంగ్రామంలో అశువులు బాసారు. నవ్వుతూ, నవ్వుతూ ఉరికంబాలకెక్కి ఉరి త్రాడును తగిలించుకొని "వందేమాతరం" అంటూ అమరవీరులైనారు. వారి త్యాగఫలితమే మన దేశ స్వాతంత్ర్యము. ఒక్క అహింసా సిద్ధాంత ప్రాతిపదిక మీదనే మనకు స్వాతంత్ర్యం లభించిందని ఎవరైనా చెబితే అసలు నగ్న సత్యాన్ని మరుగు పరుస్తున్నారేమో నని బాధ పడవలసి వస్తుంది. గత చరిత్ర పుటలను త్రిప్పితే ఎంతోమంది విప్లవ వీరులు స్వాతంత్ర్య సంగ్రామంలో అడుగడుగునా మనకు కనిపిస్తారు. వారు చేసిన సాహస కృత్యాలు మనల్ని వెన్నుచరిచి మేల్కొల్పుతాయి. అయితే దురదృష్ట వశాత్తు చాలామంది వీరులకు చరిత్రలో సముచితమైన స్థానం లేకుండా పోయింది. స్వాతంత్ర్యానంతరం కూడా చరిత్రలో ఆ త్యాగధనులకు స్థానం కలిపించ బడలేదు. ఇది నిజంగా దురదృష్టం. త్యాగం, బలిదానం. ఆత్మార్పణలు చేసిన వీరుల చరిత్రలు చరిత్ర పుటలలో పాఠ్య పుస్తకాలలో ఎక్కే శుభదినం ఏనాడు వస్తుందో, అనాడే ఈదేశానికి నిజమైన స్వాతంత్ర్యం సిద్ధించిందని భావించాలి. అప్పుడే ఆ అమరవీరుల ఆత్మలు సంతోషిస్తాయి.

## కాంగ్రెసు మహాసభలు

కొన్ని రోజుల తరువాత రాజగురు వచ్చి కలకత్తాలో భగత్‌సింగ్‌ని కలుస్తాడు. వారిరువురు కలిసి 1928లో జరిగిన కాంగ్రెసు మహాసభకు హాజరై నాయకులందర్ని కలిసి వారి విప్లవ పంథాను వివరిస్తారు. కలకత్తాలో వున్న విప్లవ వీరులతో సంబంధాలను ఏర్పర్చుకుంటారు. కలకత్తాలో కారన్‌వాలీస్ రోడ్డులో నున్న ఆర్యసమాజం మందిరంలో రహస్యంగా బాంబుల తయారీ శిక్షణ తీసుకుంటారు. తరువాత ఆగ్రా వెళ్ళుతారు. పంజాబ్ నుండి సుఖదేవ్, రాజస్థాన్ నుండి కుందన్‌లాల్‌లు కూడా వచ్చి వీరితో కలుస్తారు. ఆజాద్ యొక్క పర్యవేక్షణలో మంచి శిక్షణ యివ్వబడుతుంది.

## ప్రజా వ్యతిరేక బిల్లులు

బ్రిటీష్ ప్రభుత్వం తన అధికారాన్ని భారత్‌పై మరింతగా బిగించడానికి కేంద్ర శాసన సభలో వ్యాపార వివాదాల బిల్లు (Traders Dispute Bill) తీసుకొని రాదలచింది. అసంతృప్తితో మండిపడుతున్న కార్మికశక్తిని అణగ ద్రొక్కడానికి ఈ బిల్లు సహాయ పడుతుంది. రెండవది ప్రజారక్షణ బిల్లు (Public Safety Bill). దీనితో తన కిష్టం వచ్చినప్పుడు, ముందు హెచ్చరికలు లేకుండానే, ఎవరినైనా కారాగారాలలో బంధించవచ్చును. ఈ రెండు బిల్లులకు తీవ్రమైన వ్యతిరేకత దేశమంతా వచ్చింది. కొద్దిమంది తాబేదారులను మినహాయిస్తే, కేంద్ర శాసన

సభకు ఎన్నికైన సభ్యులందరూ దీనికి వ్యతిరేకులే. అయితే ఆఖరి అస్త్రం వైస్రాయి "వీటో"ను ప్రయోగించి ఈ బిల్లులను ప్యాస్ చేయించుకొని సర్వాధికారాలను తమ గుప్పిటలో పెట్టుకోవాలని బ్రిటీష్ ప్రభుత్వం సంకల్పించుకున్నది.

## శాసన సభలో బాంబు

1929 మార్చి నెలలో ఆగ్రాలో విప్లవ వీరులు రహస్య సమావేశం జరిపారు. పై రెండు బిల్లులు ప్యాసయినాయని ప్రకటించిన వెంటనే శాసనసభలో బాంబు పేల్చాలని తీర్మానించుకున్నారు. ఆదిలో భగత్ సింగ్‌ని పంపడానికి మాత్రం ఎవరూ అంగీకరించలేదు. చిట్టచివరికి భగత్‌సింగ్ వత్తిడి వలన అంగీకరించక తప్పలేదు. ప్రవేశ పత్రాల సహాయంతో మారువేషంలో భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తులు ప్రేక్షకుల గ్యాలరీలో ప్రవేశించారు. భగత్‌సింగ్ తలపై ఫెల్ట్ హ్యాట్‌ను ధరించి, జేబులో గుళ్ళు నింపిన రివాల్వర్లు, చొక్కా లోపల రెండు బాంబులు, తాము విసరవలసిన కరపత్రాలు పెట్టుకున్నాడు. వారు వెళ్ళిన కొద్ది సేపటికి ఆజాద్, భగవతీచరణ్, సుఖదేవ్, వైశంపాయన్‌లు కారులో బయలుదేరి శాసనసభ ప్రాంగణం వద్దకు చేరారు. పట్టుపడితే విచారణ జరిగేటప్పుడు ఇంగ్లీషులో స్టేట్‌మెంట్ యివ్వవలసివస్తే, ఇబ్బంది పడతాడనే నెపంతో "రాజగురు"ను భగత్‌సింగ్‌తో పంపడానికి అంగీకరించరు. "నేను ఏకాకిగానే సాధిస్తాను. ఏమైనాసరే" అని రాజగురు పూనాకు వెళ్ళిపోతాడు. సభాధ్యక్షుడు విఠల్‌భాయి పటేల్ తన స్థానంలో ఆసీసులైనారు. ప్రభుత్వ పక్ష నాయకుడు జాన్‌షూస్టర్, ప్రతిపక్ష నాయకులు మోతీలాల్ నెహ్రూ, మహమ్మదాలీజిన్నా ప్రభృతులు ఎవరి స్థానాలను వారు అలంకరించారు. ప్రశ్నోత్తరాల సమయం ముగిసింది. పై రెండు ప్రజా వ్యతిరేక బిల్లులు ప్రవేశపెట్టబడ్డాయి. చర్చ కొనసాగింది. ఓటింగ్ జరిగింది. బిల్లులు వీగిపోయినాయి. సరె జాన్ షూస్టరు లేచి వైస్రాయి గారి

> "భగత్‌సింగ్ ఇప్పుడొక వ్యక్తికాదు. ఒక ఆదర్శ చిహ్నం. దేశాన్ని ఉగ్రూత లూగిస్తున్న విప్లవకాంక్ష ప్రభంజనానికి భగత్‌సింగ్ ఒక గుర్తు. మార్గదర్శి. అతని ఆత్మ శక్తినెవరూ ఓడించలేరు. ఆ శక్తి రగిలించిన విప్లవ జ్వాలల్ని ఎవరూ ఆర్పలేరు."
>
> — నేతాజీ సుభాస్ చంద్రబోస్

"వీటో" అధికారం పై రెండు బిల్లులూ...." అని ఏదో చెప్పబోయాడు. అంతలో ప్రేక్షకుల గ్యాలరీలో రెండు సింహ కిశోరాలు లేచి నిలబడ్డాయి. జేబులో నున్న బాంబులు తీసి విసిరారు. అవి భయంకర శబ్దం చేస్తూ ప్రేలాయి. "ఇంక్విలాబ్ జిందాబాద్" అనే నినాదాలు మారుమ్రోగాయి. సభంతా అల్లకల్లోలం అయిపోయింది. ఎక్కడివారక్కడ చెదిరిపోయారు. కొంతమంది బయటకు పారిపోయారు. మరి కొంతమంది బల్లల్కింద దూరారు. సభంతటిలో కదలకుండా, బెదరకుండా కూర్చున్న వారు ముగ్గురే ముగ్గురు. వారు విఠల్‌భాయి పటేల్, మోతీలాల్ నెహ్రూ, జిన్నాలు. గృహశాఖ సభ్యుడు జేమ్స్‌క్రేరార్ వికారంగా కేకవేస్తూ మూర్ఛిల్లాడు. అరగంట గడిచింది. కొంతమంది సార్జెంట్లు భయపడుతూ భయపడుతూ నిర్భయంగా నుంచున్న ఆ యిద్దరి దగ్గరకు వెళ్ళి " ఈ పని చేసింది మీరేనా " అని సార్జెంట్ టెర్రీ భయపడుతూ అడుగుతాడు. " ఔను " అని శాంతంగా, నిబ్బరంగా, హుందాగా, ధృఢంగా వారిద్దరూ జవాబిస్తారు. చేతులలో నున్న పిస్తోళ్లను ప్రక్కకు విసిరి పారేస్తారు. చేతులు ముందుకు చాపుతారు. ఆ చేతులకు సంకెళ్లు తగిలించబడుతాయి. వారిద్దర్ని వేరు వేరు వ్యానులలో పోలీసు స్టేషన్కు తీసుకొని వెళ్లుతారు.

## కోర్టు విచారణలు

1929 ఏప్రియల్ 8 వ తేదీన శాసనసభలో బాంబులు పేల్చి అరెస్టు అయిన భగత్‌సింగ్, బటుకేశ్వరదత్తాలను మే 7 వ తేదిన ఢిల్లీసెంట్రల్ జైల్లో "పూల్" అనే మేజిస్ట్రేట్ ముందు వుంచుతారు. తరువాత సెషన్స్ కోర్టుకు పంపుతారు. జూన్ 12 వ తేదీన న్యాయమూర్తి 'మిటల్‌టన్' వారికి యావజ్జీవ కారాగార శిక్ష విధిస్తాడు. ఈ కేసు పూర్వాపరాలను ప్రజలకు తెలియచేయడానికి అవకాశం లభించగలదనే ఉద్దేశ్యంతో ఉన్నత న్యాయ స్థానానికి అప్పీలు చేసుకుంటారు. ఈలోపు లాహోర్ లోని కాశ్మీర్ బిల్డింగ్స్‌పై జరిగిన దాడిలో బంధితులైన సుఖదేవ్, జయగోపాల్‌లు కూడా భగత్‌సింగ్‌ను జైలులో కలుస్తారు. స్యాండర్స్ హత్యా కేసులో వున్న మరో ముఖ్య నేరస్థుడు 'రాజగురు' పూనాలో తన స్వంత ఇంట్లోనే దొరికిపోయి న్యాయస్థానానికి తీసుకొని రాబడతాడు. పాత మిత్రులందరూ ఒకే చోట కలుసుకునే భాగ్యం లభించినందుకు వారు ఎంతో సంతోషిస్తారు జైల్లో వీరిని యమయాతనలు పెడుతారు. నిరసనగా భగత్‌సింగ్ ప్రభృతులు నిరాహారదీక్షలు కొనసాగిస్తారు. పోలీసులు బలవంతంగా ఆహారం ఎక్కించే ప్రయత్నాలు చేస్తారు. అయినప్పటికీ ఆహారాన్ని తీసుకోవడానికి నిరాకరిస్తారు. పోలీసులు ఇష్టం వచ్చినట్లుగా కొడలారు

అపస్మారక దశలో ఇంజెక్షన్స్ ద్వారా ద్రవ పదార్థాలను ఎక్కిస్తుంటారు. 64 రోజులు నిరాహారదీక్ష చేసిన బెంగాల్ యువ విప్లవకారుడు జతీన్‌దాస్, 1929 సెప్టెంబరు 18 న మరణిస్తాడు. వార్తా పత్రికలు పతాక స్థాయిలో ఈ విషయాలను ప్రచురిస్తాయి. దేశం అట్టుడికి పోతుంది. ప్రతి పట్టణంలో నిరసన ప్రదర్శనలు ప్రజలు చేస్తారు. ఉద్యమం ఉధృత రూపం దాలుస్తుంది.

## ప్రత్యేక కోర్టు

1930 మే 1 న జస్టిస్ జె. కోల్డ్ స్ట్రీమ్ (ఛైర్మన్), ఆగాహైదరీ, డి. సి. హిల్టన్‌లతో ప్రత్యేక కోర్టు ఏర్పాటయింది. లాహోర్‌లోని "పూంచ్‌హౌస్" లో మే 5 నుండి విచారణ ప్రారంభమైంది. ప్రభుత్వ న్యాయవాది 'కార్టన్‌నోడ్' 24 మంది విప్లవకారులు ఈ కేసులో నిందితులని జాబితా దాఖలు చేస్తాడు. బ్రిటీష్ చక్రవర్తికి వ్యతిరేకంగా కుట్ర, బాంబులతయారీ, యుద్ధం చేస్తూ-దోపిడీలు హత్యలకు తలపడ్డారని అభియోగం చేయబడుతుంది. భగత్‌సింగ్ ప్రభృతులను (16 మందిని) కోర్టులో హాజరు పరుస్తారు. మిగతా వారు పరారీలో వున్నారని పేర్కొంటారు. ఈ ప్రత్యేక కోర్టును నియమించే అధికారం ప్రభుత్వానికి లేదని, తన వాదాన్ని నిరూపించుకోవడానికి 15 రోజులు వ్యవధి కావాలని 'భగత్ సింగ్' కోరుతాడు. కాని ట్రిబ్యూనల్ అందుకు అంగీకరించదు. భగత్‌సింగ్ తరుపున వాదించడానికి న్యాయవాదు లెందరో ముందుకు వస్తారు. కాని భగత్‌సింగ్ దానికి అంగీకరించడు. చిట్ట చివరికి 'లాలాదునీచంద్' అనే న్యాయవాది సలహా మాత్రం తీసుకొని అతనే కోర్టులో వాదిస్తాడు. మే 12 వ తేదీన నిందితుల్ని సంకెళ్లు వేసి జీపులో కోర్టుకు తీసుకొని వస్తారు సంకెళ్లు వుంటే కోర్టుకు హాజర్ కామని భగత్‌సింగ్ ప్రభృతులు పట్టు పడుతారు. పోలీసులతో ఘర్షణ జరుగుతుంది. ప్రేక్షకులు, పత్రికా విలేఖరులు చూస్తుండగానే భగత్‌సింగ్‌ను కోర్టులోనే కర్రలతో, చెప్పులతో పోలీసులు దారుణంగా కొడతారు. ఆ నాటి కోర్టు విచారణ మీద న్యాయమూర్తులలో ఒకరైన భారతీయుడు 'ఆగాహైదర్' సంతకం చేయ నిరాకరిస్తాడు. ఛైర్మన్ కోల్డ్ స్ట్రీమ్ దీర్ఘకాలం శలవు పెట్టి వెళ్లిపోతాడు.

1930 జూన్ 21 న మళ్లీ జస్టిస్ కె. కె. టేప్, అబ్దుల్‌ఖాదర్‌లతో మరో ట్రిబ్యునల్ ఏర్పాటవుతుంది. కోర్టువారు, పోలీసులు అన్యాయంగా ప్రవర్తిస్తున్నందుకు నిరసనగా దేశమంతటా "భగత్‌సింగ్ విజయోత్సవ దినం" జరుపుతారు. జైలు నుండి కోర్టుకు తీసుకొని వచ్చేటప్పుడు భగత్‌సింగ్ ప్రభృతులను విడిపించడానికి చేసే ప్రయత్నాలు సఫలం కావు. ఏదో విధంగా భగత్‌సింగ్‌కు మరణ శిక్ష విధించకుండా చూడాలని నాయకులు ప్రయత్నాలు కొనసాగిస్తారు. విజయకుమార్ సిన్హా లాహోర్ వెళ్లి భగత్‌సింగ్‌తో జైలులో మాట్లాడుతాడు. భగత్‌సింగ్ తాను చేసిన పనికి క్షమార్పణ చెప్పుకోవడానికి నిరాకరిస్తాడు. "మరణ శిక్ష నుంచి తప్పించుకో చూడ్డం విషాదభరితం గదా! మన ఉన్నతాశయాలకు అనుగుణంగా నేను మరణ శిక్షననుభవించడమే ఏకైక కర్తవ్యం" అని భగత్‌సింగ్ స్పష్టంగా చెబుతాడు.

## మరణశిక్ష

1930 అక్టోబర్ 7వ తేదిన ప్రత్యేక కోర్టు 50 పేజీల జడ్జిమెంటు ప్రకటిస్తుంది. భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురుల్ని "మరణించే వరకు ఉరితియ్యాలి" అని; విజయకుమార్ సిన్హా, శివవర్మ, కిశోరీలాల్, జయదేవ్ కపూర్ మహావీర్‌సింగ్, డా. గయప్రసాద్‌నిగం, కమలనాథ్ తివారీలకు యావజ్జీవ శిక్ష విధిస్తూ అండమాన్స్ ఖైదులో వుంచాలని తీర్పు చెబుతారు. కుందన్‌లాల్‌కు ఏడేళ్ళు, ప్రేమ్‌దత్‌కు అయిదేళ్ళు కఠిన శిక్షలు విధిస్తారు. బటుకేశ్వర్‌దత్ ఈలోపే తప్పించు కుంటాడు. మరికొందర్ని కేసులు ఋజువు కాలేదని విడుదల చేస్తారు. ఈవార్త తెలియగానే దేశంలో పలుచోట్ల నిరసన ప్రదర్శనలు జరుగుతాయి, లాఠీచార్జీలు బాష్పవాయు ప్రయోగాలు,

తుపాకి కాల్పులు పెక్కు చోట్ల జరుగుతాయి. అనేకమంది నాయకులు దేశభక్త వీరులను ఉరి తీయరాదని వైస్రాయికి విజ్ఞప్తులు చేస్తారు. ప్రయోజనం వుండదు. ఆ వీరులను జైలునుండి తప్పించే ప్రయత్నంలో బాంబు పేల్చి 'భగవతీచరణ్' మరణిస్తాడు.

## ఉరితీసారు

1929 సెప్టెంబర్ 29వ తేదిన సర్దార్ కిషన్‌సింగ్ తన బిడ్డ (భగత్ సింగ్) ప్రాణాల్ని కాపాడ వలసిందిగా పిటీషన్‌లు దాఖలు చేస్తాడు. కాని ప్రభుత్వం దాన్ని నిరాకరించింది. 1931 మార్చి 24న భగత్ సింగ్, సుఖదేవ్, రాజగురులను ఉరితీయాలని ప్రభుత్వం నిర్ణయించింది. సహజంగా తెల్లవారుజామున ఉరితీయడం ఆనవాయితి. దానికి భిన్నంగా 23 వ తేది రాత్రే ఉరితీయడం జరిగింది. మార్చి 23 తేది సాయంత్రం చీకటి పడిన తరువాత భగత్ సింగ్ గదికి వెళ్లి జైలర్ 'రెడీ' కమ్మనమని హెచ్చరిస్తే పుస్తకం చదువుకుంటూనే 'అయామ్ రెడీ' అని భగత్ సింగ్ నవ్వుతూ సమాధానమిచ్చాడట. జైట ఆవరణంలో వెనుక భాగాన ఈ ముగ్గురు యువకిశోరాలను ఉరితీయడానికి ప్రత్యేకంగా గద్దెను నిర్మించారు. భగత్ సింగ్, సుఖదేవ్, రాజగురులను తమ తమ జైలు గదుల నుండి సాయుధ భటులు మరణశయ్య మీదకు తీసుకొని వెళ్లుతుంటే నవ్వుతూ నినాదాలు చేయప్రారంభించారు. 'ఇంక్విలాబ్ జిందాబాద్' వందేమాతరం అంటూ నడువసాగారు. మరుక్షణంలో తమ ప్రాణాలను కోల్పోతామని వారికి బాగా తెలుసు. అయినప్పటికి వారి ముఖాల మీద చిరునవ్వు తాండవిస్తునే వున్నది. తమ ప్రాణాల్ని రక్షించుకునే అవకాశాలు ఎన్నో వున్నా, కక్కుర్తిపడక తమ ఆశయాలను ప్రపంచానికి తెలియపరచాలనే పరమావధితో; తమ మరణం ద్వారా దేశ ప్రజలు ఉత్తేజితులై స్వాతంత్ర్య సమరసంగ్రామంలో వీరులుగా మారాలనే ఆంకాక్షతో ఉరికంబాన్ని వరించిన వీరకిశోరాలు - భగత్ సింగ్, సుఖదేవ్, రాజగురులు. వారు తమ జీవితాన్ని ఆత్మార్పణ చేసారు. భారత యువతలో పౌరుషాన్ని మేల్కొల్పారు. ఆంగ్లేయులను గడగడలాడించిన ఆ ముగ్గురు వీరకిశోరాలను బలి పీఠమెక్కించారు. సరీగా ఏడుగంటల ఇరువై నిముషాలకు వారి ముఖాలకు నల్లటి ముసుగులు వేయబడ్డాయి. ముగ్గురూ ఒకరినొకరు మనసారా గాఢంగా ఆలింగనం చేసుకున్నారు. చివరిసారిగా తల్లి భారతికి వినీతులై నమస్కరించారు. భగత్‌సింగ్, అక్కడే వున్న సీనియర్ ఆంగ్లజైలర్ వైపు వ్రేలు చూపి "మీరు చాలా అదృష్టవంతులు. భారతస్వాతంత్ర్య సంగ్రామ సైనికులు నిర్భయంగా నవ్వు ముఖంతో, మృత్యువునెలా ఆహ్వానిస్తారన్నది కళ్లారా చూచే అవకాశం మీకు లభించింది. మేమది మీకు చూపిస్తాం" అని అంటాడు. జైలుగోడల బయట నుండి జయజయధ్వనాలు వినిపిస్తుంటాయి. బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధులు వారి పని ప్రారంభిస్తారు. నల్లగుడ్డలతో కప్పబడిన ఆ విప్లవ వీరశిరోమణుల మెడ చుట్టూ ఉరిత్రాడు చుట్టబడుతుంది. వందేమాతరం అంటూ ముగ్గురు ఒకే పర్యాయం సింహగర్జన చేస్తారు. ఏడు గంటల ఇరువై ఏడు నిముషాలు అవుతుంది. ఆ బలి వేదిక క్రింద కొయ్య పలక "టక్" మని ఊడిపడుతుంది. ఆ విప్లవవీరకిశోరాల పంచప్రాణాలు అనంతాకాశంలో కలసిపోతాయి. శాశ్వతంగా అమర వీరులవుతారు. వారి ఆత్మశాంతికి మనం జోహారు లర్పిద్దాం.



> "త్యాగి, అసమాన ధైర్యశాలి అయిన భగత్ సింగ్‌ను మనం రక్షించుకోలేక పోయాం. యువతరానికి ఆయన ఆదర్శ ప్రాయుడు. మన అసహాయతను తలచుకొని మనం సిగ్గుపడదాం, కాని ప్రాణ త్యాగం చేసి మనల్ని వదలి వెళ్ళిన భగత్‌సింగ్‌ని తలచుకొని గర్వపడదాం."
>
> పండిత జవహర్‌లాల్ నెహ్రూ

# ... ఇక ఎన్నికల సంస్కరణలు రావాలి

బంగ్లాదేశ్‌లో ఈమధ్య రిఫరెండం ఎన్నికలు జరిగాయి. జనరల్ ఎర్షాద్ కావాలా వద్దా అనే ప్రశ్న మీద. "కావాలి" "వద్దు" అని వ్రాసి ఉన్న పెట్టెల్లో ఓట్లు పోలయినాయి. జనరల్ ఎర్షాద్ గెలిచాడన్నారు.... అది వేరే విషయం.

భారతదేశంలో లోక్‌సభ ఎన్నికలు కూడా ఒక మాదిరి రిఫరెండంగానే జరిగాయి—రాజీవ్ కావాలా, వద్దా అనే ప్రశ్న ప్రధాన అంశం అన్నట్లు. రాజీవ్‌కు అనుకూలంగా 49 శాతం వ్యతిరేకంగా 51 శాతం ఓట్లు పడ్డాయి. బంగ్లాలో మాదిరి "కావాలా" "వద్దా" అనే రెండు పెట్టెలే పెట్టి ఉంటే రాజీవ్ నాయకుడై ఉండేవాడు కాదన్న మాట.... మరి ఎవరయేవారో అది వేరే మాట.

## ఎన్నికల పద్ధతిలో చమత్కారం

ఇంతకూ చెప్పవచ్చిందేమంటే—ఎన్నికలు నడిపే పద్ధతిలో అంత చమత్కారం ఉందన్నమాట. ఒక పద్ధతి ప్రకారం 49 శాతం ఓట్లతో ఐదింట నాల్గు వంతుల సీట్లు పొంది రాజీవ్ నాయకుడైనాడు. మరో పద్ధతిలో అన్ని ఓట్లే వచ్చినా అతడు నాయకుడు అయేవాడు కాడన్నమాట.

ప్రజాస్వామ్యంలో ఎన్నికల పద్ధతి ప్రాముఖ్యం అంతటిది. ఓట్లకు సీట్లకు పొంతన ఎంత ఎక్కువ ఉంటే అది ప్రజాస్వామ్యానికి అంత చేరువలో ఉన్నట్లు. మన దేశంలో దాదాపు ప్రతిసారి ఇలాగే మైనారిటీ వోట్లతో ప్రభుత్వాలు ఏర్పడుతున్నాయి. కేంద్రంలోనే కాదు, రాష్ట్రాల్లో కూడా. ఇంత కీలకమైన ఎన్నికల పద్ధతి గురించి, వోట్లకు సీట్లకు పొంతనను గురించి 36 ఏళ్ళయినా ఇక్కడ పునరాలోచన జరగలేదు.

## ఫిరాయింపు నిషేధం ఎన్నికల సంస్కరణా ?

ప్రస్తుత పద్ధతిని మార్చే ముఖ్య ప్రయత్నం జరగలేదు కాని—ఈమధ్య హడావిడిగా పార్టీల మార్పిడి నిషేధం చట్టం మాత్రం చేశారు. అదే పెద్ద ఎన్నికల సంస్కరణ అన్నట్లు అంతా జేజేలు పలికారు. పార్టీ ఫిరాయింపుల నిషేధం ముఖ్య విషయమే గాని దానివల్ల సరిఅయిన ప్రజాస్వామ్యం ఎలా ఏర్పడుతుందనేది శేష ప్రశ్న.

## దేశవాణి

చట్టం ఎన్నికల అనంతర పరిస్థితికి సంబంధించింది. పైగా లెజిస్లేటర్లకు పరిమితం అయినటిది. మూల సంస్థ అయిన పార్టీకి, దానికి ప్రజల్లో ఉన్న పలుకుబడి ప్రకారం లెజిస్లేచర్‌లో ప్రాతినిధ్యానికి సంబంధించింది కాదు. అసలు మూల సంస్థ అయిన మాతృ సంస్థకు ఇందులో ఏమంత ప్రత్యక్ష ప్రసక్తి లేదు.

## మాతృసంస్థ త్రోసి రాజు

1969లో ఇందిరాగాంధీని మూలసంస్థ పార్టీనుండి తొలగించింది. ఆమె పార్లమెంటును మాత్రం వదలలేదు పార్లమెంటు సభ్యులను అధికార బలం ఉపయోగించి ముఠా కట్టి, మాతృసంస్థనే త్రోసి రాజని, స్వంత పార్టీ, స్వంత చిహ్నంతో రాజ్యమేలింది. అసలు పార్టీ అడుగంటి పోయింది అధికారం చేజిక్కించుకున్న ముఠా సర్వస్వం అయిపోగల్గింది. దీనిని రాజ్యాంగం గాని, చట్టం గాని నివారించలేక పోయింది. అసలు పార్టీ ముఖం చూచి వోట్లు వేసిన ప్రజలకు ఏమీ చేసే హక్కు లేక




పోయింది. చివరకు అధికారం చేజిక్కించుకున్న వారే పార్టీకి, ప్రభుత్వానికి శాసకులైపోయే స్థితి వచ్చింది. లెజిస్లేచరు పార్టీ అనేది అసలు పార్టీకి ఒక ఉపాంగం. ఇప్పుడు అసలు పార్టీ పని, లెజిస్లేచర్ పార్టీ నాయకునికి భజన చేయడం, బిల్లులు వేయడం తప్ప వేరే ప్రతిపత్తి లేదు. భారతదేశపు పార్టీ నిర్మాతలు ఊహించిన పార్టీ సహిత ప్రజాస్వామ్య వ్యవస్థ ఇది కాదు. కేవలం పార్టీ ఉపాంగమయిన లెజిస్లేచర్ పార్టీ నాయకుడే, పార్టీకి కూడా పెత్తందారు కావడం అనేది ప్రజాస్వామ్యానికి అనుగుణం కాదని అప్పట్లో కృపలానీ, టాండన్ ప్రభృతి హేమా హేమీలందరూ పోరాడారు. 1969, 70ల వరకు ఆ పోరాటం, ఆ నిరోధం సాగుతూనే వచ్చింది. ఆ తర్వాత కథ పూర్తిగా మారిపోయింది. పార్టీ బ్రతుకు పార్టీ చేతుల్లో లేదు. జాతి బ్రతుకు జాతి చేతుల్లో లేదు. రెండూ ప్రభుత్వాన్ని గుప్పిట్లోకి తెచ్చుకున్న వారి చేతుల్లో ఉంటున్నాయి. ఇక ప్రజల చేతుల్లో ఉన్నది ఐదేళ్ళ కొకసారి ఓటు కాగితం. ఎన్నికల నాల్గు రోజులూ ఏదో గమ్మత్తు, గారడీ చేసి ఆ ఓట్ల కాగితాలు ఎలాగోలా ఎవరైనా ప్రోగు చేసుకో గల్గితే ఇక ఐదేళ్ళ వరకు "ఇంతే సంగతులు".

ప్రజలు కోరుకుంటున్న "స్వామిత్వం" ఇదే అయితే ఇక "ఈ బడ్జటు ఇలా ఉందేం ? ఈ పాలన ఇలా ఉందేం ? ఈ ధరలు ఇలా పెరుగుతున్నాయేం ?" అని అనుకునే నైతికాధికారం ప్రజల కుండదు. పార్టీల మార్పిడీ నిషేధం వల్ల వారికి ఒరిగేది కూడా ఏమీ ఉండదు. ఆశించిన ప్రజాస్వామ్యం జాతి జీవితంలో కనిపించాలంటే పార్టీల మార్పిడీ వికృతిని వదిలించు కోవడంతో పాటు ఇంకా చాలా చర్యలు ఆలోచించు కోవాలి.

## అసలు పార్టీల ప్రతిపత్తి నిర్ణయించాలి

ముందు పార్టీల ప్రతిపత్తి, రాజ్యాంగ పరంగా చట్ట పరంగా వాని స్థానం నిర్వచించు కోవడం అవసరమని పిస్తుంది. అందులో స్వదేశీ జాతీయ ప్రజాస్వామిక పక్షాలను, అంతర్జాతీయ ఉద్యమాలకు అంగ ఉపాంగాలుగా ఉంటూ ఈ దేశంలో పార్టీలుగా చెప్పుకునే (ఉదా: కమ్యూనిష్టు) పార్టీలను విడమర్చి నిర్వచించు కోవడం: ప్రాంతీయ సేవా లక్ష్యాలు గల పక్షాలుగా ఉన్న వాటిని అసెంబ్లీ పోటీలకు పరిమితం చేయడం, మత వర్గాలకు మాత్రమే పరిమితమైన పార్టీలను మినహాయించడం, ఫెడరల్ పార్టీల స్థితులు ఈ మాదిరి విశ్లేషణలు అవసరమనిపిస్తుంది.

## తోకలతో కాంగ్రెస్ పేరు వాడరం

ఇదే సందర్భంలో స్వరాజ్య ఉద్యమంగాఉన్న "కాంగ్రెస్" అనే పేరును, ఐ, జె, ఎస్, ఆర్, యు, ఈ మాదిరి తోకలు తగిలించి వాడుకోకుండా నిషేధించు కోవడం కూడా అవసరమే. మహాత్మాగాంధీ, రాజ్యచిహ్నాల వంటివి ఏ పార్టీ ఏ ప్రైవేటు సంస్థ, వ్యాపార సంస్థ వాడ కుండా నిషేధాలున్నప్పుడు, స్వరాజ్య ఉద్యమమైన 'కాంగ్రెస్' పేరును వాడకుండా నిషేధించడంలో అనౌచిత్య మేమీ లేదు. పైగా "కాంగ్రెస్" శత జయంతి ఉత్సవం అని చెప్పుకునే ఈ సంవత్సరం అలా చేయడం చాలా సముచితం కూడా. మహాత్మాగాంధీ అంతిమ ఉత్తర్వు కూడా "కాంగ్రెస్"ను రద్దు చేసి, లోకసేవాసంఘం పెట్టుకోమని. ఇదంతా రాజకీయ పరంగా స్థూలంగా జరుగదగిన కొన్ని పనులు.

## ఎన్నికల కమిషన్ అధికారం పెరగాలి

ఇక ప్రత్యేకించి ఎన్నికల పరంగా జరుగ వలసిన పెక్కు సంస్కరణలు పలువురు ప్రముఖులు చాలా కాలంగా సూచిస్తున్నారు. వానిలో మొదటిది ఎన్నికల కమిషన్‌ను ప్రస్తాకరంగా పూర్తిగా స్వతంత్రం చేసుకొని విస్తరించి అవసర అధికారాలన్ని ఇచ్చుకోవడం, ఇప్పుడు దీని పరిస్థితి-ప్రధానమంత్రి చిటిక వేసినప్పుడు ఎన్నికలు జరిపే ఒక డిపార్టుమెంటు వలె ఉంది. అలా కాక అమెరికాలో వలె ఐదేళ్ళ కొకసారి, నిర్ణీత తేదీలలో (లేదా ప్రత్యామ్నాయ తేదీలలో) స్వయంగా ఎన్నికలు నిర్వహించే స్వతంత్ర సంస్థగా ఉండడం, దానికి స్వతంత్ర నిర్వహణ యంత్రాంగం ఉండడం, లోక్‌సభ, అసెంబ్లీ ఎన్నికలు ఒకేసారి జరపడం, స్థానిక సంస్థల ఎన్నికల నిర్వహణను ముఖ్యమంత్రుల దయా దాక్షిణ్యాల పరిధిని తప్పించి కమిషన్ అధికారం క్రిందికి తేవడం, ఎన్నికల కమిషన్‌ను ఏకసభ్య వ్యవస్థగా గాక ఎక్కువమంది ఉండడం ఇత్యాదులు పరిశీలనార్హాలు. అలాగే ఎన్నికల ప్రచార నియమాలను రూపొందించి అమలు చేయడం; అదుపు చేయడం; రేడియో, టి. వి. లను ఎన్నికల సమయంలో వాడడం పై నియమాలను రూపొందించి, అదుపు చేసే అధికారం కల్పించడం, ప్రభుత్వ యంత్రాంగ వినియోగంలో దీని అదుపును విస్తరించడం కూడా అవసరం. భారత్ వంటి ప్రపంచంలోకెల్లా పెద్ద ప్రజాస్వామ్యంలో ఎన్నికల కమిషన్ ఇట్టి ప్రతిపత్తితో, హోదాతో, అధికారంతో ఉండడం చాలా అవసరం. ఈ సంస్కరణల వల్ల-ముఖ్యంగా ఒకేసారి ఎన్నికలు జరపడం వల్ల చాలా ఖర్చు కలిసివస్తుంది. అధికార దుర్వినియోగంపై అదుపు ఉంటుంది. రాజీవ్ గాంధీ వంటి వాళ్ల రాజ్యాంగ తత్వ విరుద్ధంగా కేంద్రంలోను రాష్ట్రాల్లోనూ ఒకే పార్టీ అధికారంలో ఉంటేనే ప్రగతి అనే మాదిరి అభ్యంతరకర ప్రసంగాలను అదుపు చేయడం, అసత్య ప్రచారాలను అరికట్టడం ఇలాంటివి సాధ్యమవుతాయి.

## అప్పుచేసి పప్పుకూడు

భారత ప్రభుత్వం మనదేశంలో వివిధ రకాలైన ఋణాలు 1950-51 నాటికి రు. 2022 కోట్లు వసూలు చేసింది. 1982 మార్చి 31 నాటికి స్వదేశంలో తీసుకున్న ఋణాల మొత్తం రు 34, 189 కోట్లు. ఇప్పటికి ఎంత పెరిగిందో తెలియదు. ఇక పోతే 1981 నవంబరు 30 నాటికి విదేశాలలో సేరించిన ఋణాల మొత్తం రు 15, 14, 657 కోట్లు. పై మొత్తం కాక అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థనుండి తీసుకున్న మొత్తం రు 5, 25, 000 కోట్లు. 1980 మార్చి 31 నాటికి మన జాతీయ ఆదాయంలో ఈ అప్పుల భాగం 55.3 శాతం.

భారత దేశం విదేశీ ఋణాలపై చెల్లించవలసిన వడ్డీల చెల్లింపుల మొత్తం 1985 1990 ల మధ్య 11, 300 కోట్ల డాలర్లు మేరకు ఉంటుంది. ఇందులో అధికభాగం ఐ. ఎం. ఎఫ్. సంస్థలకు చెల్లించ వలసి వుంటుంది. అసలు, వడ్డీ కలిపి విదేశీ ఋణ బకాయి చెల్లింపుల మొత్తం 1985-1990ల మధ్య 1694.8 మిలియన్ డాలర్లు 1990 నాటికి ఈ మొత్తం 1811 మిలయన్ డాలర్లు ఉంటుందని ప్రపంచ బ్యాంక్ ప్రకటించిన ప్రపంచ దేశాల బకాయిల పద్దులు తెలుపుతున్నాయి. ఆరో ప్రణాళికా కాలంలో విదేశీ ఋణభారం మరో 8 బిలియన్ల మేరకు పెరిగినట్లు ప్రపంచబ్యాంక్ లేఖలు తెలియజేస్తున్నాయి.

మన ప్రభుత్వ విధానం 'అప్పుచేసి పప్పు కూడు' లా వున్నది. ఇంత అప్పు చేసినప్పటికి భారత ప్రజలందరికి పప్పు కూడు లభ్యం కాక పోవడం శోచనీయం.

## వోటుకు సీట్లకు పొంతన రావాలి

రెండవ పెద్ద సంస్కరణ వోట్లకు సీట్లకు పొంతనకు సంబంధించింది. పశ్చిమ జర్మనీ వంటి దేశాలలో ఇది ఆచరణలో ఉన్నదని చెప్పబడుతోంది. ప్రజలు వివిధ పార్టీలకు ఓటు చేస్తే ఆ వోట్ల దామాషాలో సీట్ల సంఖ్యను కేటాయించే పద్ధతి అది. ముందుగా పార్టీలు ప్రకటించిన అభ్యర్థుల జాబితాలలో నుండి ప్రాధాన్యతల క్రమంలో ఆయా పార్టీలకు వచ్చిన సీట్ల సంఖ్యను బట్టి సభ్యులను నిర్ణయించే పద్ధతి. ఉన్నంతలో ఇది ఉత్తమమే అవుతుంది గాని ఆచరణలో ఇబ్బందు లున్నాయని చెప్పబడుతోంది. ముఖ్యంగా మనం ఆంగ్లేయుల పద్ధతిలో నియోజక వర్గాల వారీ వ్యక్తుల నెన్నుకుంటాం. పార్టీలనేవి ఎన్నికల గుర్తులకు వలెనే, అభ్యర్థుల సిద్ధాంతాల గుర్తింపుకు సంకేతాలుగా మాత్రమే ఉంటున్నాయి. ఈ పద్ధతిలో నియోజక వర్గాలకు అభ్యర్థులు ప్రతినిధు లవుతారు గాని పార్టీ కాదు. దామాషాపద్ధతి అవలంబిస్తే పార్టీలకే ప్రధానమైన గుర్తింపు ఉంటుంది. అభ్యర్థులు పార్టీల ప్రతినిధులుగా ఉంటారు. పార్టీల ప్రతిపత్తి నిర్వచించుకుంటే ఇది ఆచరణ సాధ్యమయే అవకాశాలు మెరుగపుతాయి. ఏమైనా కొన్ని ప్రదేశాలు లేదా కొన్నిరకాల (ఉదా: స్థానిక సంస్థలు) ఎన్నికలకు ఇది ప్రయోగాత్మకంగానైనా ఆరంభించడం మంచిది అనిపిస్తుంది. వోట్ల, సీట్ల పొంతనకు మరిన్ని మార్గాలు అన్వేషించడం కూడా అవసరం.

## ప్రతినిధి ఉపసంహరణ
## నెహ్రూ ఉదంతం

మూడవ అంశంగా చెప్పుకోదగింది—ఎన్నికయినవారు సక్రమంగా వ్యవహరించనప్పుడు వారిని ఉపసంహరించే హక్కు వోటర్ల చేతుల్లో ఉండడం. రైట్ ఆఫ్ రికాల్. ఈ పద్ధతి స్విట్జర్లాండ్‌లో ఉన్నట్లు తెలుస్తుంది. మన దేశంలో ఒకసారి ఎన్నికయిన తర్వాత ఇక అతడెలా వ్యవహరించినా ఏమి చేయడానికి వీలు లేని స్థితి. ఒకసారి పండిత జవహర్లాల్ నెహ్రూ తన నియోజక వర్గంలో పెద్ద సంఖ్య వోట్లతోనే ఎన్నికయినారు. దేశమంతా అప్పట్లో గోహత్యా నిషేధం కోరుతోంది. జవహర్లాల్ నెహ్రూ మొండికెత్తాడు. ఆ మొండితనానికి హద్దూ లేదు, విరుగుడూ లేదు. ఆయన నియోజక వర్గంలో ప్రజలు కూడా చికాకు పడ్డారు. అందులో ఆయనను గెలిపించి సమర్థించిన వారూ ఉన్నారు. వారందరూ సంతకాల ఉద్యమం ఆరంభించారు. "మీకు గోహత్యను నిషేధించడం ఇష్టం లేకపోతే మీరు మా ప్రతినిధిగా చెలామణి కావడం మాకు ఇష్టం లేదు. మీరు రాజీనామా చేయాలి"— అనే పత్రం మీద సంతకాలు సేకరించారు. ఆయనకు పడ్డ వోట్లకన్నా ఎంతో ఎక్కువమందిసంతకాలు చేశారు. అయినా ఆయన వైదొలగ లేదు. రాజ్యాంగం గాని, చట్టంగాని, ఓటర్లు గాని ఎవరూ ఆయనను దించలేక పోయినారు. అలాగే ఇటీవలి ఉదాహరణ తెలుగు దేశం పార్టీకి సంబంధించింది. సక్రమంగా ప్రవర్తించక పోతే వైదొలుగుతానని అభ్యర్థులు ప్రజల మధ్య ప్రమాణాలు చేశారు. కాని తీరా జరిగిందేమిటి ? నాదెండ్ల భాస్కరరావు ఉదాహరణ వివరిస్తుంది. అతడు ఏమి జరిగినా శాసన సభ్యత్వం వదలలేదు. పైగా నల్గురితో పాటు మళ్ళీ ఎన్నికలకు సిద్ధమయినాడు. ప్రజలపట్ల ఎన్నికయిన వారి జవాబుదారీ ఇంత హీనస్థితిలో ఉంది. అందువల్ల రైట్ ఆఫ్ రికాల్ హక్కు వోటర్లకుండాలి అనే భావం కొన్ని వర్గాల్లో ఉంది. జయప్రకాశ్ నారాయణ్ కూడా అలాగే భావించేవారు. కాని ఇన్నిరకాల రాజకీయాలు, కలయికలు, విభేధాలు, ముఠాలు, చీలికలు ఉన్న ఈ దేశంలో ఈ అధికారం ఉంటే ఇక ఏ స్థానంలోనూ నిలకడయిన అభ్యర్థి మిగలడేమో అనే భయం పలువురిలో ఉంది. ప్రస్తుతం వచ్చిన పార్టీ ఫిరాయింపుల నిషేధ చట్టం ఆ విషయంలో కొంత అక్కర తీరుస్తుందనే భావం ఉంది. కాని అది పూర్తి సమ్మకాన్నివ్వదు. ఈ స్థితిలో సమగ్ర ఎన్నికల సంస్కరణల సందర్భంగా ఈ అంశాన్ని కూడా కొంత ఆలోచించదగి ఉంది.

(సశేషం)

## నీడ

మనిషికి నిరుపయోగం తన నీడ
పిసినారి పొదుపు చేసిన డబ్బులా !
తనకి గానీ పరులకి గానీ
ఉపయోగించదు సేద తీర్చదు !!

— చిల్లర భవానీదేవి

## ముఖద్వారం

విరిసే ప్రతి భావం
కవితా సూర్యోదయం !
కవి ఊహలకు
ప్రకృతి ముఖద్వారం !!

– కె. శివరామకృష్ణ

## FORM IV

See rule 8

1. Place of Publication : MACHILIPATNAM
2. Periodicity of its Publication : Monthly
3. Printer's Name : K. KRISHNA MOHANA RAO
   (Whether citizen of India?) : Yes
   Address : K. KRISHNA MOHANA RAO
   24-51, Ramanaidupet, Machilipatnam.
4. Publisher's Name : K. KRISHNA MOHANA RAO
   (Whether citizen of India?) : Yes
   Address : K. KRISHNA MOHANA RAO
   24-51, Ramanaidupet, Machilipatnam.
5. Editor's Name : K. KRISHNA MOHANA RAO
   (Whether citizen of India?) : Yes
   Address : K. KRISHNA MOHANA RAO
   24-51, Ramanaidupet, Machilipatnam.
6. Names and addresses of individuals who own the newspaper and partners or share holders holding more than one percent of the total capital. : ——

I, K. Krishna Mohana Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

[Sd.] K. KRISHNA MOHANA RAO
(Signature of Publisher)

Dated : 31-3-1985

# చిలక, గోరింక జోడు కడతాయా!

డాక్టర్ దుగ్గరాజు శ్రీనివాసరావు

చిలకా గోరింకలవలె జీవించమని నూతన దంపతులను దీవించటం మన ఆచారం. చిలక అడ పక్షి అని, గోరింక మగ పక్షి అని, అవి రెండు కలసి అన్యోన్యంగా జీవిస్తాయని, అందువలనే అలా దీవించటం జరుగుతున్నదని చాలామంది అభిప్రాయం కాని ఆ దీవెన వెనకాలవున్న శాస్త్రజ్ఞానం బహు తక్కువ మందికి మాత్రమే తెలుసు.

చిలుక, గోరింక వేరు వేరు జాతులకు చెందిన పక్షులు. చిలుకల్లో అడ చిలుకలు, మగ చిలుకలు వున్నాయి. అవి రెండు కలిసి జంటగా జీవిస్తాయి. అదేవిధంగా మగగోరింక అడ గోరింకతో మాత్రమే కలుస్తుంది. అంటే చిలుకకు, గోరింకకు అసలు సంబంధమే లేదన్నమాట. చిలుక, గోరింక ఒక దాని ముఖం మరొకటి చూసుకునే ప్రశ్నే లేదు. మరి నూతన దంపతులు కూడా చిలక, గోరింకల వలె ఎడ ముఖం, పెడముఖంగా జీవించమనా మన పెద్దల అభిప్రాయం? కానేకాదు. అలాంటప్పుడు ఆ దీవెన ఎలా వాడుకలోకి వచ్చింది. మన పూర్వీకులకు పక్షుల గురించి సరైన అవగాహన లేకపోవటం వల్ల అని ఎవరైన అనుకుంటే పొరపాటు పడ్డట్టే. ప్రకృతిని వారు పరిశీలించినంత నిశితంగా ఈ కాలంవారు పరిశీలించటం లేదనే చెప్పాలి.

చిలుకల్లోను, గోరువంకల్లోను ఒక ప్రత్యేకత వుంది. అవి జీవితంలో ఒక్కసారి మాత్రమే జంట కడతాయి. ఒక అడ చిలుక, ఒక మగ చిలుక కలిసి కాపరం ఆరంభిస్తే అవి ఆ జన్మకు విడిపోవు. మరణం మాత్రమే వాటిని విడదీయగలదు. విధివశాత్తు ఆ జంటలో ఒకటి చచ్చిపోతే రెండోది మిగిలిన జీవితమంతా ఒంటరిగానే జీవిస్తుంది. అంతేకాని మరోసారి మరో చిలుకతో జంట కట్టదు చిలుకల్లో జంట మధ్య వుండే బంధం అంత గట్టిదన్నమాట.




గోరింకల్లో వుండే బంధం మరింత బలమైనది. జంట కట్టిన గోరింకల్లో ఒకటి మరణిస్తే రెండోది జీవితం మీద కాంక్షను కోల్పోతుంది. బ్రతికున్న గోరువంక ఆహారం తీసుకోవటం మానేసి, దిక్కు తోచని దానిలా ప్రవర్తిస్తూ కుంగి, క్రుసించి వీలైనంత త్వరగా ప్రాణం వదిలే ప్రయత్నం చేస్తుంది

దాంపత్య బంధం చిలుకల్లోను, గోరింకల్లోను మాత్రమే అంత పవిత్రంగా, బలంగా వుండటం గమనించిన మన పెద్దలు, ఆ బంధాన్ని నొక్కి చెపుతూ చిలకా గోరింకల్లా జీవించమనే దీవెనను వాడటం ఆరంభించారు.



## కొత్త సీరియల్ ప్రారంభం

# వారం వర్జ్యం; తారాబలం, చంద్రబలం; దుర్ముహూర్తం వగైరాలన్నీ ఒకటికి పదిసార్లు చూసుకుని పెట్టుకున్న సుముహూర్తంలో ...

స్నానం చేసి... పట్టుపంచె కట్టుకుని... బొట్టు పెట్టుకొని విఘ్నేశ్వరపూజ చేశాడు. భక్తిగా... రెండు చేతులూ జోడించి... దేముడికి నమస్కరించి ఇంకా భక్తిగా కళ్ళు మూసుకుని... మనసులో ఏదో తలుచుకుంటూ... కోరుకుంటూ... విఘ్నేశ్వరుడి ముందు కొబ్బరికాయ కొట్టాడు. సరిగ్గా సగానికి పగిలింది నారికేళం.




శుభ శకునం అనుకుని పొంగిపోయాడు రామచంద్రమూర్తి. ఎక్కువ నీళ్ళు గ్లాసులోకే పడ్డాయని దినకర్, లేత కొబ్బరి పచ్చడి బాగుంటుందని సుభాషిణీ, కోరు (తురుము) కుందుకు వీలుగా ఉందని పార్వతీ – ఎవరికివారు మనసులో మహదానందపడ్డారు.

"ఇంక మీరందరూ అవతలకి వెళ్ళండి." అన్నాడు రామచంద్రమూర్తి పూజ పూర్తయిందని గంట కొట్టేస్తూ.

"విష్ యు బెస్టాఫ్ లక్." అన్నాడు దినకర్ కొబ్బరినీళ్ళ గ్లాసునందుకుని నోట్లో పోసుకుంటూ.

"డిటో" నవ్వింది సుభాషిణి ప్రసాదం తీసుకుంటూ.

పార్వతి పైకేమీ అనలేదు. కాని .... మనస్సులో .... "వినాయకా ! విఘ్న రాజా ! మావారి ప్రయత్నానికేవిధమయిన ఆటంకమూ కలుగకుండా నిర్విఘ్నంగానూ విజయవంతంగానూ పూర్తిచేసేటట్లు చూడు. అనుగ్రహించు." అని దేముణ్ని ప్రార్థించింది.

"ఈ విషయం ఎవరితోనూ అనకండేం...." వెళ్ళబోతున్న పిల్లలని హెచ్చరిస్తున్నట్లన్నాడు రామచంద్రమూర్తి. "అతి రహస్యమని చెప్పారుగా." ఎవరికీ చెప్పం అని హామీ యిస్తున్నట్లన్నారు వాళ్ళిద్దరూ.

సుభాషిణి మార్నింగ్ షోకి వెళ్ళిపోయింది.

దినకర్ ఫ్రెండ్ దగ్గరకి పోయాడు.

పార్వతి కబుర్లు చెప్పుకుంటూ కోరు (తురుము)కోవచ్చు కదా అని కొబ్బరి చిప్ప పట్టుకుని పక్కింటి పిన్నిగారింటికి బయలుదేరింది.

ఆ గదిలో——

రామచంద్రమూర్తి ఒక్కడే మిగిలాడు, అతని అభీష్టానుసారం. ఒక్కసారి దేవుడి బొమ్మవేపు చూశాడు, ఏం చేసినా నీదే భారమన్నట్లు. తరువాత-సరస్వతీదేవి పటం వేపు చూశాడు ప్రార్థిస్తున్నట్లు.

"సరస్వతీ నమస్తుభ్యం, వరదే కామరూపిణీ

నవలారంభం కరిష్యామి, సిద్ధిర్భవతుమేసదా."

శ్లోకం ముగించి ....మెల్లగా ....సరస్వతీదేవి పటం క్రిందుగానూ....వినాయకుడి బొమ్మకి పక్కగానూ ఉన్న బంగీని అందుకోబోయాడు. దాని పక్కనే కొత్త కలం ఉంది.

అతని చేతులు వణికాయి.

ఎలాగో పార్సెలు విప్పాడు.

అతని గుండె దడదడ లాడింది. నోరెండిపోయింది.

బి. పి. ఎక్కువయింది.

ఒక్క నిముషం ఆగాడు.

ధైర్యే సాహసే నవలాలక్ష్మీ అని తనకి తానే ధైర్యం చెప్పుకున్నాడు. తెగించి-తెల్లకాగితాల దొంతరనూ కలాన్నీ చేతుల్లోకి తీసుకోబోయాడు. కాగితాల బరువుకి చేతినరం కరేల్ మంది. చెయ్యి విరిగి పోతుందేమో అనిపించింది. హనుమంతుడు సంజీవ పర్వతాన్నంత అవలీలగా ఎలా ఎత్తేశాడా అనుకున్నాడు.

ఎంత బరువీ కాగితాల దొంతర !

ఔను. ఆరు దస్తాలు....మూడు వందల అరటావులు!

బాబోయ్ !....అరవబోయాడు.

"బాలుండీతడు....కొండ దొడ్డది." పద్యం మెదిలింది మెదడులో. ఇది....యీ——కట్ చేసిన తెల్ల కాగితాల దొంతర——కొండలాగే కనిపిస్తూంది.

తను-అనవసరంగా రొంపిలోకి దిగుతున్నాడేమో ! చేతులారా-సుఖాన ఉన్న ప్రాణాన్ని దుఃఖాన పెట్టుకుంటున్నాడేమో ?




మూడువందల పేజీలు ! తనతరమేనా ?

పట్టుమని——ఏకబిగిని-మూడు మూళ్ళ తొమ్మిది పేజీలయినా వ్రాసి ఎరుగడే యీ నలభయ్యేళ్ళ జీవితంలోనూ. అరవయ్యో యేట అగ్నిగండమని-నలభయ్యో పడిలో యీ నవలా గండమేమిటి ? ఏమిటి తనకీ పరీక్ష ?

కాగితాల కొండ——కొండచిలువలా ;

పక్కనున్న సిరా బుడ్డి-కాలకూట విషపాత్రలా ;

తెరచిన కలం-కాలనాగు కోరలా....

తనమీదకు మూకుమ్మడిగా దండెత్తుతున్నట్లు....

అతను గాట్టిగా (గట్టిగా) కళ్ళు మూసేసుకున్నాడు.

భయం నుంచి-నిముషం పావుకి కాని తేరుకోలేకపోయాడు.

'నవల రాయడం నా తరం కాదు.

దేముడా, రక్షించు....నన్ను నవల నుంచి.'

ప్రార్థించ బోయాడు.



అ॥  కళ్ళ ముందు బిల్లు నాట్యం చేయసాగింది.

| | | రు-పై |
|---|---|---|
| ఆరు దస్తాల తెల్ల కాగితాలు | — | 18-00 |
| కటింగ్ ఛార్జిలు | — | 1-00 |
| విల్‌సన్ పెన్ | — | 5-50 |
| సిరా బుడ్డి | — | 2-50 |
| పెరశి | — | 27-00 |

(అక్షరములా యిరవై ఏడు రూపాయలు మాత్రమే)

ఇరవై ఏడు రూపాయలు !.... ఇంత సొమ్ము గంగ పాలేనా ? ఊహుఁ.... వొద్దు.... నవల రాయాలి.

రాయక పోతే ఎలా :

రాసి - తీరాలి. చచ్చినట్లు రాసి తీరాలి.

నిండా మునిగాక చలేమిటి ? కాగితాలు .... సిరా .... కలం.... కొనేసి.... విఘ్నేశ్వర పూజ చేసేసి - రోటిలో తలదూర్చి రోకటిపోటుకి వెరువనగునా అన్నట్లు- నవల రాయడానికి వెనుకాడడమా ? నో. వెన్నివ్వకూడదు. పెన్ను పట్టవలసిందే. తన కోసం కాకపోయినా.... తన వారి కోసమయినా సరే.... రాయాలి. తను- కమిటెడ్ ( బంధితుడు ) ! ఎలాగ మరచిపోగలడది ?

నిన్నరాత్రే —

" పార్వతీ ! నీకు పట్టు చీరెలు కొంటాను. పది కాసుల బంగారం కొంటాను. "

" దినకర్ ! నిన్ను కర్చుకి వెరవకుండా ఇంజినీరింగో మెడిసినో - ఏది కావాలంటే అది చదివిస్తాను. "

" సుభాషిణీ ! నువ్వు కోరుకున్న వాణ్ని కట్న మిచ్చి తెచ్చి పెళ్లి చేస్తాను. "

వాళ్లు మరచి- మహోత్సాహంగా.... ఎలక్షన్ల ముందు ప్రజల ముందు రాజకీయనాయకుడిలా వాగ్దానం చేసేశాడు.

వాళ్లు- నమ్మలేదు. నిద్రలో లేపాడు మరి వాళ్లని. "అర్ధరాత్రి వేళ అంకమ్మ శివాలని - ఏమిటండీ యిది ?" ఆవలిస్తూ అంది పార్వతి.

"అంకమ్మ శివాలు కావు. అసలు సిసలయిన నిజాలు. రేపు జరగబోయేవి. "

" జ్యోతిష్కుడి దగ్గర కెళ్లొచ్చారా ఫాదర్ ? " దినకర్ సందేహం వెలిబుచ్చాడు. తనకి కోపం వచ్చింది- వాళ్లు నమ్మి చేసినట్లు తన మాటలని నమ్మక పోయే సరికి. " షటప్.... మీకు తెలియదు....మీరలా చూస్తూ ఉండండి, మన యిల్లు బంగారమౌతుంది. మన పేరు మారుమోగిపోతుంది." ధీమాగా గర్వంగా అన్నాడు.

"లాటరీ టికెట్ కొన్నారా ?" అడిగింది సుభాషిణి.

"లాటరీ కర్మేమిటే, పాపిష్టి సొమ్ము. దోపిడీ డబ్బు... నవలే తగిలింది."

"నవల తగలడమేమిటండీ రాయోరప్పోలాగ ?"

అమాయకత్వం బయట పెట్టుకుంది పార్వతి.

"నీకు తెలియదులే. చూడూ....నీకేయే రంగుల పట్టు చీరెలు కావాలో రేపటినుంచే ఆలోచించుకుని ఉంచుకో తరవాత కంగారు పడతావు. మనకి—యిక నుంచి బోలెడంత డబ్బు రాబోతూంది...."

"మంచిదే. ఇక పడుకుందామా ?"

"నిద్ర !....ఛీ....వొట్టి ఆడదాని వనిపించుకున్నావ్. ఇంత సంతోషకరమయిన వార్త విన్నాక నిద్రెలా వొస్తూంది ?"

"పగలంతా వాకిరితో అలసి ఉంటానుగా...పనిమనిషేనా లేదాయె. రాత్రయ్యేసరికి నిద్రరాకేం చేస్తుంది ?" దీర్ఘం తీసింది—ఎత్తి పొడుస్తున్నట్లు.

"సరే. నువ్వెళ్ళి పడుకో." అనుమతి యిచ్చేశాడు ఆమెకి.

"విషయమేమిటి ఫాదర్?" పెద్ద ఆరిందాలా అడిగాడు దినకర్.

"నేను సీరియల్స్ వ్రాయబోతున్నాను."

"నిజం !" నమ్మలేనట్లు చూసింది సుభాషిణి. "నేనెప్పుడో చెప్పాను—ఎన్ని కథలు రాసినా ఫలిత ముండదు, ఒక్క నవల రాయండి అని. చిన్నపిల్లవి నీకేంతెలుసులే అని తీసిపారేశారు.

పంది పిల్ల లీను పదియు నైదింటిని
కుంజరంబు గాంచు కొదమ నొకటి.

పదిహేను కథల కంటె ఒక్క నవల ఎంతో మేలు..."

"నీమాట పదహారణాల నిజం. బాల వాక్కు, బ్రహ్మ వాక్కు అని ఊరికే అనలేదు. వాస్తవాన్ని-నేను ఆల స్యంగా గుర్తించాను. అందుకు పశ్చాత్తాప పడుతున్నాను."

"బెటర్ లేట్ దాన్ నెవర్. ఫాదర్ ! ఐతే నేనూ మీతో స్మశానాలకి వొస్తాను."

తెల్లబోయి చూశాడు దినకర్ వేపు. "స్మశానాలకిదేనికీ?"

అమాత్రం తెలియదా అన్నట్లు— "పత్రికలో సీరియ లంటే....

స్థలము :—స్మశానము.
సమయము :- అమావాస్యనాటి అర్థరాత్రి.
పాత్రలు :- ప్రేత భూత పిశాచములు.
అంతేగా ," అనేశాడు.

"కాదు-" అన్నాడు తను కోపంగా.

"ఐతే- పాము సీరియల్. ష్యూర్. నాన్నగారూ ! మీరు పాము సీరియలే రాయండి. పాము ఆబాల గోపా లమూ ఇంటరెస్టింగ్ సబ్జక్ట్. పాము వెనక సెంటి మెంటుంది. అందుకే పాము సీరియల్‌కి సినిమా ఛాన్సె క్కువ. నోము సినిమా పామే కదా ? పాముకీ సినిమాకీ సంబంధం నాటిదీ నేటిదీ కాదు. చరిత్రలో—మోహినీ రుక్మాంగద లేక పాము పాట ; బాలరాజు....నోము అను

## ధర్మం - మతం

"ధర్మానికి రాజకీయాలతో సంబంధం లేదని అనే వారికి ధర్మమంటే ఏమిటో ఎంతమాత్రం తెలియదు. దేవాలయాలు, మసీదులు, చర్చీలు ఉండటంపాపమని భావించేవారితో నేనేమాత్రం ఏకీభవించను. అంద రికీ చెందిన అరాధనా కేంద్రాలుండటం మానవాళికి అత్యంతావశ్యకం. మనుష్యుల శ్రేయస్సుకే మతా లున్నాయి. అన్ని మతములసారం మానవశ్రేయస్సే. మత విశ్వాసం మానవుని జీవితానికి చుక్కాని. మతములనేవి ఒకేగమ్యానికి చేర్చే విభిన్నమార్గాలు. మతములనేవి మానవులను చీలదీసేవి కావు. అంద రిని ఏకం చేసేవి.

సత్యసాక్షాత్కారమే అన్ని మతముల గమ్యం. ఆధ్యాత్మిక శక్తిని, శీలసంపదలను యినుమడింప జేయడమే మతముల పరమావధి. ప్రతివారు తమ మతం తాలూకూ మూలసూత్రాలను, ప్రధాన లక్ష ణాలను క్షుణ్ణంగా తెలుసుకోవాలి. ప్రతివారు తమ మతభావాలను ఎలా గౌరవించుకుంటారో, అన్యుల మతభావాలను కూడా అలాగే గౌరవించాలి. మతా లన్నింటిని గౌరవించే సహనశక్తి యున్నప్పుడు వివిధ మతముల మధ్య సంఘర్షణలుండవు.

మనదేశంలో ఎన్నిమతాలకు చెందిన వారమున్న ప్పటికీ, మనమంతా ఒకే జాతికి చెందిన వారమనే భావం మాత్రం విస్మరించరాదు."

— మహాత్మాగాంధీ

## తరుణోపాయం

పున్నమి ఎలక్షన్‌కి
ముందు
వెన్నెల పట్టాలు
ప్రదానం చేయడం
చంద్రుని రాజకీయం;
నిత్యసత్య దీధితులకై
సూర్యోదయం
అయ్యే అంతలోపల
తాత్కాలిక భాగోతం
అనివార్యం.

కొలకలూరి స్వరూపరాణి

పాము....మీ చిన్నతనంలో నాగిన్....మా చిన్నతనంలో మరో నాగిన్. పాము సబ్జక్టులో ఉన్న మహాత్మ్యం అదే. దేశ కాలమాన పరిస్థితుల కతీతంగా ఎప్పుడూ హిట్టే ఔతుంది. మ్యూజిక్కి మాంచి స్కోపుంటుంది. అంచేత సీన్లు పండుతాయి. అంచేత మీరు....పాము...."

"స్టాప్!" భరించలేక పోయాడు. "పాములూ ప్రేతాలూ తప్పితే తెలుగు నవలకి కథావస్తువులే లేవనుకుంటున్నారా?" అరిచాడు ఆగ్రహంగా.

"అనుకోవడం లేదు. అరవై వేల ఒకటవ సంవత్సరంలో ఆవకాయ—అనే విషయం మీద రాయొచ్చు. తలనొప్పి మాత్రలో తప్పుల తడకలు....సైంటిఫిక్ ఫిక్షన్... విఠలాచార్య బాబులా ఊహించేసి—అంగారక గ్రహం అమ్మాయీ....భూలోకం అబ్బాయీ చంద్రగ్రహం మీద లవ్ చేసుకుని....పెద్దలు కాదనగా ఝుమ్మని జూపిటర్‌లో జాలీగా హనీమూన్ చేసుకుని యురేనస్‌లో ఫ్యామిలీ పెట్టినట్లు రాయొచ్చు...."

"నోరు మూయొచ్చు." ఆగ్రహం ఆపుకోలేక పోయాడు. సాహిత్యమంటే క్షురకారుకి కూడా ఎంత తేలికైపోయింది!

"మీరు లోపలికి పొండి."

"మేము పోతాం. కాని—మీరిచ్చిన వాగ్దానాలు మాత్రం పోవు. మైడియర్ ఫాదర్! కాలు జారితే తీసుకోగలం కానీ నోరు జారితే తీసుకోలేం. మరచిపోకండి." అని హెచ్చరించి మరీ పోయారు.

"అలాగే." అని ప్రకాశముగా అని—పన్నెండేళ్ళు దాటిన సంతానాన్ని స్నేహితులు వలె చూడాలనే సూత్రం అందరి విషయంలోనూ వర్తించే అమోఘ సూత్రం కాదేమో అని మనసులో అనుకున్నాడు. కొందరు—పిల్లలు కారు, పిడుగులు. దినకర్ .... సుభాషిణీ — పార్వతనే పిల్లి కడుపున పుట్టిన పులిపిల్లలు. పట్టుకుంటే వదలరు. వాళ్ళకు చేసిన వాగ్దానం కోసమయినా నవల రాయాలి. మార్గాంతరం లేదు.

కాగితాల వేపు చూశాడు.

బహు భయంకరంగా ఉన్నాయి.

ఏడుపొస్తూంది వాటిని చూస్తున్నకొద్దీ. బండెడు హోమ్ వర్క్ ముందేసుకుని...ఏదీ చేయలేక....కరచరణాలాడని కాన్వెంట్ కుర్రాడికిలా కళ్ళు తుడుచుకుంటూ కూర్చున్నాడు.

ఇన్ని కాగితాలూ రాయాలా! అమ్మో!....ఎప్పటి కయ్యేను? ఈ జీవితాని కయ్యేనా?

అవాలి.

ఐ తీరాలి.

జీవితం చివరకి కాదు. అంతవరకూ గడువులేదు. ఇరవై రోజులే ఉంది. ఈలోగానే రాసెయ్యాలి.

పిల్లల ముందు తలెత్తుకోవాలంటే సీరియల్ నవల రాసి తీరవలసిందే.

వాళ్ళసలే ఉద్దండులు. "సీరియల్ రాయలేని తండ్రి కడుపున పుట్టినందుకు మేము చాలా పశ్చాత్తాప పడుతున్నాం నాన్నా!" అని అనెయ్యడానికేనా వెనకాడరు.

తను- ఇరుక్కుపోయాడు.

నవలలో యిరుక్కుపోయాడు.

పార్వతెంత పతివ్రతయినా- "పొట్టి గొడ్డుకి అరుపు లెక్కువని యీ మాత్రం దానికేనా విఘ్నేశ్వర పూజ కూడా చేశారు పది రూపాయలు దండగపెట్టి?" అని అడగకుండా ఉండదు. తను నవల రాసి చూపకపోతే, ఏం కర్మ వొచ్చి పడింది!

చేతులారా చేసుకున్నాడు మొగుడు కొట్టినందుకు కాదు కానీ తోటి కోడలు దెప్పిందని—నవల రాయలేక పోయినందుకు కాదు, తనవాళ్ళు నవ్వుతారని భయపడ వలసి వొస్తుంది.

నవ్వి పోదురుగాక నాకేటి చేటు....

పైవాళ్ళనయితే అలా తీసి పారెయ్యొచ్చు కేరెజాట్ అని.

కాని.... ఇంట్లో వాళ్ళతో అలా కుదరదు.

ఎంత కష్టం వొచ్చి పడింది! నిజంగా—యిది తన లాటి మంచి వాళ్ళకి రావలసిన కష్టమేనా?

రామచంద్రమూర్తి లేచి నిలుచున్నాడు.

చాలా సేపు కూర్చుని ఉండడంతో కాళ్ళు పట్టేశాయేమో ఒక్కసారి లేచి నిలుచునే సరికి హాయిగా అనిపించింది. గదిలో అటూ యిటూ నాలుగడుగులు వేశాడు. ఇంకా నయమనిపించింది. కాని....పొరపాటున అతని దృష్టి అప్రయత్నంగా కాగితాల బేలు (300 కాగితాలూ అతనికి బేలు లాగే కనిపించాయి) మీద పడింది. అతనికి మళ్ళీ నీరసం వొచ్చేసింది.

"లావొక్కింతయు లేదు.... ధైర్యము విలోలంబయ్యె
ప్రాణంబులున్ ఠావులు దప్పెను మూర్ఛవచ్చె
తనువున్ దస్సెన్ శ్రమంబయ్యెడిన్.
రావే యీశ్వర కావవే వరద సంరక్షించు భద్రాత్మకా!"

గది తలుపులు మూసి ఉన్నాయన్న ధైర్యంతో-ఫ్రీగా పద్యం చదివాడు రాగంతో. (అతని కంఠం గద్గదికంగానే ఉంది కనుక పద్యం రాగయుక్తంగానే వొచ్చింది!)

అంతేమరి.

తను.... తనంతట.... రాయలేడు. పోతనగారి చేత రామచంద్రుడు రాయించినట్లు తన చేత యీ నవలని దేవుడు రాయించవలసిందే.

దేవుడు—వారపత్రికకి సీరియల్ రాయిస్తాడా? సందేహం. దేవుడు కాకపోతే మనిషి రాస్తున్నాడా? నెలల తరబడీ, సంవత్సరాల తరబడీ, దశాబ్దాల తరబడీ- ఎడతెగకుండా సాగే సీరియల్స్ రాయడం మానవ మాత్రుడి తరమేనా? బుద్ధిబలం మాట వదిలేసినా- భుజ బలం సంగతో?

తన నవల—దేవుడొచ్చి రాస్తాడా?

రాయడేమో. ఫెయిర్‌గా ఆలోచిస్తే తను నిజమయిన భక్తుడు కాడు. పరీక్షల సమయంలో స్టూడెంటు భక్తే తనదీను. ఇవాళ-నవల కోసమని విఘ్నేశ్వర పూజ చేశాడు కాని లోగడ ఎన్నడయినా కొబ్బరికాయ కొట్టిన పాపాన (పుణ్యాన?) పోయాడా? లేదే.

దాసుని తప్పులు దండము (దణ్ణము?)తో సరి.

చెంపలేసుకుని....నవల పూర్తయితే కొండకొస్తానని మొక్కుకున్నాడు. ధైర్యం వొచ్చి-కాగితాల ముందు కూర్చున్నాడు.

కృత్యాద్యవస్థంటే యింతే మరి. మొదలు పెట్టాలే కాని అలా అలా గంగా ప్రవాహంలా సాగిపోదూ?

(అతని చేయి తగిలి నీళ్ళగ్లాసు వొలికి-గంగ పారింది అతని కిందకి). నీళ్ళు వొలకడం—శుభ శకునమా, దుశ్శకునమా? ఎందుకేనా మంచిదని ఓ నిముషం ఆగాడు.

ఛీ ఛీ....ఏమిటీ కర్మ నీకు?

అంతరాత్మ వెక్కిరించినట్లనిపించింది.

అతనికి పౌరుషం వచ్చింది. తీవ్రంగా ఆలోచించాడు. (బట్టతల కనుక జుత్తు పీక్కోలేదు.) ఒకటి....రెండు.... మూడు....నాలుగు....ఆశ్చర్యపోయాడు. ఇంత చిన్న విషయం ఎందుకు తెలియ లేదింతసేపూ తనకి?

"ఐడియా!" కేక పెట్టాడు. నవల రాయడానికి సుళువు తెలిసి పోయిన ఆనందంలో అతను తననీ పరిస సరాలనీ మరచి అద్భుత సత్యం కనిపెట్టిన ఆర్కిమెడీస్ లాగే అరిచాడచ్చంగా.

"ఐడియా!" గదిలో ప్రతిధ్వనించింది.

(సశేషం)

# భారతీయ సంస్కృతి - సాంఘిక స్పృహ

ఋగ్వేదములో "దానసూక్తములని" కొన్ని యున్నవి. వానిలో దానము యొక్క ప్రాశస్త్యము, కీర్తింపబడినది. యజుర్వేదములో "కేవలా ఘో భవతి కేవలాది.... అహమద్మి అన్యాన్".... "మోఘమన్నం విన్దతే అప్రచేతాః" "తానొకడే అన్నము తిను అవివేకి, కేవల పాపమునే అనుభవించును. (కేవల పాపియగును) దానధర్మములు చేయువారు నన్ను (అన్నమును తిందురు) చేయనివారిని నేను తిందును". "తేనత్యక్తేన భుంజీథాః మాగృధః, కస్యస్విత్ ధనమ్?" అని ఈశావాస్యోపనిషత్ - లౌకికార్థపరముగ ఈ వాక్యమును అన్వయించునపుడు "త్యాగము చేసి అనుభవింపుము. ఎవని ధనమునకును ఆశపడకుము. (ఇది ఎవని సొత్తు! నీది కాదు. అందుచే నీకు కావలసిన దానిని మాత్రమే అనుభవించి, మిగిలినదానిని త్యాగము చేయుము)"

## భాగవతుల కుటుంబరావు

బృహదారణ్యకోపనిషత్తులో ఒక ఉపాఖ్యానము ఉన్నది. దేవతలు, మనుష్యులు, రాక్షసులు కొన్ని సంవత్సరములు బ్రహ్మచర్యము చేసి, ప్రజాపతిని - "మాకు మీరు ఒక అనుశాసనమును ఇవ్వండి" అని అడిగినారు. ప్రజాపతి ద, ద, ద అనినాడు-దాని భావము ఇది. "దమము (ఇంద్రియ నిగ్రహము) దానము - దయ - అనువానిని ఆచరింపవలెను." మనుష్యులకు ముఖ్యముగా "దానము చేయుడు" అని ఉపదేశమీయబడినది. అపుడు శ్రీశంకరులు తమ భాష్యములో "స్వభావతో లుబ్ధాయూయం, అతోయథాశక్త్యా సంవిభజత-దత్త" మీరు సహజముగా లుబ్ధులు, అందువలన యథాశక్తిగ సంవిభాగము చేసికొనుడు (పంచుకొనుడు) - దానము చేయుడు (ఈయుడు) అని వివరించినారు.

వేదములోనే మరియొకచోట - "తతోన ఉగ్రా విభజా వసూని" - ధనములను మనము పంచుకొందము" అని యున్నది. భగవద్గీతలో "యజ్ఞోదానం తపశ్చైవ పావనాని మనీషిణామ్". యజ్ఞము, దానము, తపస్సు అనునవి మనుష్యులను పావనముచేయును" అనియున్నది. ఇందులో దానము గూడ నున్నది.

"త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః-కామః క్రోధస్తథాలోభః తస్మాదేతత్ త్రయం త్యజేత్"

"కామము, క్రోధము, లోభము- అనునవి మూడును నరకమునకు ద్వారములు. అందుచే వానిని విడువ వలయును" అనియును గీతలోనే యున్నది. ఈ వాక్యమునకును, బృహదారణ్యకములోని "ద, ద, ద" అను ఉపదేశమునకును సంబంధము, సాదృశ్యము ఉన్నవి. భగవద్గీతలోనే వేరొక సందర్భములో చెప్పిన "పరస్పరం భావయన్తః శ్రేయః పరమవాప్స్యథ." ఒకరి క్షేమమును ఒకరు చూచుచు, శ్రేయస్సును పొందండి అను వాక్యము మానవ సమాజమునకును వర్తించును. ఇది సాంఘిక స్పృహ కదా!

శ్రీమద్భాగవతమునందు రంతిదేవుని చరిత్రము ఈ విషయమున మననము చేయదగినది. రంతి దేవుడను రాజు "తన సంచితార్థంబులన్నియు నెడపక దీనులకిచ్చియిచ్చి, సకుటుంబుడై, ధైర్య సంయుతుడై, పేదయై, కూడును, నీరును లేక" నలువది యెనిమిది దినములు ఎచటనో తిరిగినాడు. అప్పుడు కొంత ఆహారము లభించినది. తినుటకు కూర్చొనబోవుచున్నాడు. ఒక బ్రాహ్మణుడు వచ్చి అన్నము నడిగినవాడు. "ప్రియముతో గౌరవించి, హరి సమర్పణ మంచు" రంతిదేవుడు అన్నములో సగము నిచ్చినాడు. ఇంతలో ఒక శూద్రుడు వచ్చినాడు. అన్నమును అడిగినాడు. ఉన్న అన్నములో ఒక భాగ

మును రంతిదేవుడిచ్చినాడు. తరువాత కుక్కల సమూహముతో మనిషి ఒకడు వచ్చినాడు. రంతిదేవుడు మిగిలిన యన్నమును పెట్టినాడు. చండాలుడు ఒకడు వచ్చినాడు. "దాహమగుచున్నది. ప్రాణము పోవుచున్నది కదలలేను. నీయొద్ద నున్న నీరు నాకిమ్ము" అని అడిగినాడు.

"అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి
త్రావుమన్న, రా
వన్న, శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న
నొండు మేలున్నదె నాకు దిక్కు పురుషోత్తము
డొక్కడె చుమ్మ పుల్కసా"

అని ఆ నీరు ఇచ్చినాడు- బ్రహ్మాది దేవతలు ప్రత్యక్షమై "నిన్ను పరీక్షించుటకు ఇట్లు జరిగినది. ఇదియంతయు విష్ణుమాయ. నీకేమి కావలయును ? కోరుకొనుము" అని అడిగినారు. ఆయన ఏమియు నడుగలేదు.

సంస్కృత భాగవతమునందు పై పద్యమునకు మూలము అనదగు శ్లోకము ఇట్లున్నది.

"న కామయేహం గతిమీశ్వరాణామ్
అష్టర్ధి యుక్తామ్ అపునర్భవం వా
ఆర్తింప్రపద్యే ఖిల దేహ భాజామ్
అంతస్థితో యేన భవన్త్య దుఃఖాః"

నేను, అష్టయిశ్వర్యములతో కూడిన రాజరికమును కోరను తిరిగి పుట్టుకలేని మోక్షమును కోరను : అందరిలో నుండి వారి బాధలను నే ననుభవించి వారు సుఖముగ నుండునట్లు చేయగల్గుటయే నాకు కావలసినది. ఇంతకు మించిన ఉత్తమమైన సాంఘిక స్పృహ, యుండునా ?

ఈ సందర్భమునసే, భారతము నందలి సక్తుప్రస్థుని కథను మనము జ్ఞాపకము తెచ్చుకొనవలయును.

నేటువు దినములు, సక్తుప్రస్థుడు, భార్య కొడుకు కోడలు, తిండి లేక మలమల మాడుచున్నారు. ఒకనాడు కొంత ధాన్యము దొరుకగా, పిండి చేసికొని నలుగురు, ఆ




పిండిని సమానముగా ఆకులలో పెట్టుకుని-తినవున్నారు. ఒక అతిధి వచ్చినాడు. సక్తుప్రస్థుడు, ఆయనను ఆదరించి, తనవంతుఅన్నమును ఆ అతిథికి పెట్టినాడు. ఆయనకు ఆకలి తీరలేదు. భార్య, తన వంతు అన్నమిచ్చినది. ఆకలి తీరలేదు. ఇట్లే కొడుకు, కోడలు కూడ తమ భాగముల నిచ్చినారు. ఆ అతిధి సంతుష్టుడై, తన నిజ రూపమును చూపి, నేను యముడను, నిన్ను పరీక్షింప వచ్చితిని అనినాడు. సక్తుప్రస్థుడు, కుటుంబము ఉత్తమ లోకములకు వెళ్ళినారు.

మహా భారతములో కపోతోపాఖ్యానమును గూడ మనము స్మరించి తీరవలయును. జోరున వర్షము పడుచున్నది. ఒక కిరాతుడు ఒక చెట్టు క్రిందకు వచ్చి కూర్చొనినాడు. ఆకలి యగుచున్నది. చలికి వణికి పోవుచున్నాడు. చెట్టు పైన మగ పక్షి యుండి, తన జోడు ఆడ పక్షి రాలేదే అని బాధతో అరుచుచున్నది. ఈ కిరాతుని చేతిలో (వలలో) నున్న ఆడపక్షి, తన స్థితిని తెలిపి, విచారింప వలదని ఓదార్పు మాటలు పలికినది. ఈ వ్యాధుడు "మనమున్న చెట్టుక్రిందికి వచ్చి పడుకొని యున్నాడు చలితో బాధపడుచున్నాడు. ఆకలితో అలమటించుచున్నాడు. ఈతనికి పూజసేయుము. ఇది మన జాతి ధర్మము. "నీవు శరణాగత రక్షకుడవు కమ్ము" అని మగ పక్షికి ఉపదేశించినది. "శీతార్తశ్చ, క్షుధార్తశ్చ, పూజామస్మై సమాచార..... అస్మాకం విహితా వృత్తిః

కాపోతీ జాతి ధర్మతః" .... మగపక్షి భార్య పలుకులకు సంతోషించినది.

బోయవానినడిగినది నీకేమి కావలయును?

"అరావప్యుచితం కార్యమాతిథ్యం గృహణాగతే
ఛేత్తుమప్యాగతే ఛాయాం నోపసంహరతే ద్రుమః"

"ఇంటికి వచ్చినవాడు శత్రువైనను సరియే అతనికి ఆతిథ్యము నీయవలెను. తనను నరుకుటకు వచ్చినవానికైనను చెట్టు నీడనిప్పుగాని ఉపసంహరింపదు గదా! ఆ బోయడు "నాకు చలివేయుచున్నది. రక్షింపుము" అన్నాడు. పక్షి ఎక్కడనో చితుకులు తీసికొనివచ్చి, నిప్పు చేసినది. అతడు చలి కాచుకొనినాడు. పక్షి "నా అవయవములను ఈ నిప్పుతో కాచుకొనుము, తినుము అని నిప్పులో దూకినది." భారతదేశములో కొన్ని పక్షులకు సైతము అతిథి పూజా విశేషము జీర్ణించినది. ఆ పక్షులను ఆదుకొనవలయునను ఆర్తి భారతీయ హృదయములలో పాతుకుపోయినది. శిబి దధీచుల కథలను గూడ జ్ఞాపకము తెచ్చుకొనదగును.

అతిథిపూజా విషయములో "వాడు, వీడు" అను విభేద దృష్టిలేదు. ఉండకూడదు.

"శునాంచ పతితానాంచ శ్వపచాం పాపరోగిణామ్
వాయసానాం కృమీనాంచ శనకైః నిర్వపేత్ బలిమ్"

"తృణాని భూమి రుదకమ్ వాక్చతుర్థీచ సూనృతా
ఏతాన్యపి సతాంగేహే నోచ్ఛిద్యన్తే కదాచన."

"కుక్కలకు, పతితులకు, కుక్క మాంసమును తినువారికి, పాపరోగులకు, కాకులకు, క్రిములకు, బలిని ఈయవలెను". సత్పురుషుల ఇండ్లలో, గడ్డి (దర్భలతో-గడ్డితో చేయబడిన ఆసనములు కూర్చొనుటకు) భూమి, నీరు, ప్రియము హితమునైనమాట, వీటికి లోపము ఎప్పుడును ఉండదు. గృహస్తులకు విహితములైన పంచ యజ్ఞములను గురించి, పాఠకులు వివరముగా తెలిసికొనవలసియున్నది. వాల్మీకి రామాయణములో గూడ నిట్లున్నది.

"అతిధిః కిలపూజార్హః ప్రాకృతోపి విజానతా
ధర్మం జిజ్ఞాసమానేన కింపునర్యాదృశోభవాన్"

మైనాకుడు హనుమన్తునితో నన్న మాటయిది. "ధర్మ జిజ్ఞాసయున్న, విజ్ఞానియైనవాడు అతిథిని, సామాన్యుడే (ప్రాకృతుడే) అయినను, పూజించి తీరవలయును- నీవంటివాని విషయములో చెప్పవలయునా?"

ఇచట నొక విషయమును గుర్తింపవలయును. అతిధులను ఆదరించి తీరవలయునుగదాయని, గృహస్థులైనవారు, ఇతరుల యిండ్లలో, తినుటకయియేవెళ్ళుట, పాపమును కలిగించునని, ఒక నిషేధము ఉన్నది.

"ఉపాసతే యే గృహస్థాః పరపాకమ బుద్ధయః
తేనతే ప్రేత్య పశుతాం వ్రజన్త్యన్నాది దాయినే"

బుద్ధిలేని ఏ గృహస్థులు, ఇతరుల యిండ్లలో తినుటయే లక్ష్యముగా నుందురో వారు మరుజన్మలో అన్నాదిదాతల యిండ్లలో పశువులై పుట్టుదురు."

భారతీయ సంస్కృతిలో ఇంత ఉదారభావము ఉండుట వలననే, ఇతర దేశీయులకు, మన దేశములో స్థావరము ఆదరము లభించినది. ఈనాటి మన సమాజములో, ముఖ్యముగా నాయకులు ఉద్యోగుల హృదయములలో "త్యాగే నైకేనా మృతత్వా మానశుః" త్యాగముతో ఒక దానితోనే అమృతత్త్వమును పొందినారు-"తేన త్యక్తేన భుంజీథాః

"మాగృధః కస్యస్విద్ధనమ్"- "మాచయాచిష్మ కంచన" మేమెవరిని యాచింప కుందుము గాక" అను భావములు ఉన్నచో, మనదేశ మింతకంటె కొంత బాగుండెడిదేమో! కనీసము, ఇటువంటి ఉదార భావములను తెలుపు గ్రంథములను కూడ మన విద్యాలయములలో మనము నేడు బోధించుట మానుకొనినాము. ఇది మన నేటి విద్యా వ్యవస్థలో నున్న మటి యొక గొప్పతనము కాదా!

ఆముక్తమాల్యద లోని విష్ణుచిత్తుని కథను, మను చరిత్రములో ప్రవరుడు అతిధి సత్కారము చేయు ఘట్టములను కూడ ఈ సందర్భములో పాఠకులు గుర్తునకు తెచ్చుకొని వానిని చదివి ఆనందింపవలయును.



నా మనసెంత ఆలోచిస్తున్నా, ఇందాకటినుండి చెవి మాత్రం ఆ వైపునే ఉంది. అటునుండి ఓ ప్రవాహంలా దూసుకొస్తున్నాయి మాటలు.

గాలి రివ్వున వీస్తూంది. నాకు రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడు మాత్రం, పరిగెత్తుకుపోయే చెట్లు, దూరంగా కదులుతుండే ఇళ్ళు పొలాల్ని చూస్తున్నప్పుడు "భూమి గుండ్రంగా" ఉందనే విషయం గుర్తుకొస్తుంటుంది. అలాగే మొత్తం రైల్వే వ్యవస్థనే ఓ తాత్విక అంశంగా చెప్పుకుంటారు.

రైలు ప్రయాణంలాంటిది జీవితం. అందులోకి ఎందరో వస్తుంటారు, పోతుంటారు. పుట్టుకతో జీవితం తల్లితండ్రులతో మొదలవుతుంది. బాల్యం, కౌమారం, యవ్వనం దాటుకుంటూ వృద్ధాప్యంలోకి సాగిపోయే ఈ సుదీర్ఘయాత్రలో ఎందరో క్రొత్త వారొస్తుంటారు. పాతవారు ప్రక్కకు తొలుగులారు. అనుబంధాల విషయంలోనూ అంతే.

ఈ రైలు పట్టాలు సమాంతరం. కొందరి భావాలు అలానే కలవ్వు. కొన్ని సంసారాలూ అంతే. అయినా సమాంతర మయిన రైలు పట్టాల్ని ఎక్కడోచోట కలుపుతుంటారు రైల్వేవారు. జీవితమూ అంతే.

ఓ కవి అన్నాడు "నువ్వెక్కబోయే రైలు ఓ జీవిత కాలం లేటు" అని. నిజమే. ఎన్నో ఆశల్తో, ఆశయాల్తో జీవితంలోకి ప్రవేశిస్తే, అనుభవంనేర్పే విషయాలు మరో రకంగా ఉంటాయి. ఆ ఊబిలో కూరుకుపోయి, బయటకు రాలేక, బ్రతకటం కోసం ఆరాట పడుతూ, ఒకటేమిటి రైలు గురించి ఓ పెద్ద గ్రంథం రాయొచ్చు.

అందులో ప్రతిదీ అనుభవమే. అనుభూతే. వాస్తవ సంఘటనల గొలుసే. నిరంతర పోరాట శ్రమయే. సంక్షోభిత జీవిత యదార్థగాథే.

నేను రైల్లో ప్రయాణం చేస్తున్నప్పుడే తీరిగ్గా ఆలోచించే అవకాశం ఏర్పడుతుంది. అప్పుడే జీవితాన్ని గురించిన చింతన మొదలయ్యేది. ఈ రైళ్ళలోనే విభిన్న ప్రవృత్తులు గల మనుషుల్ని వారి మనస్తత్వాన్ని గమనించే అవకాశం ఏర్పడింది. ఏర్పడేది కూడా.




మిగతా దేశాల్లో రైల్వేల ఫిలాసఫి ఎలాఉంటుందో నాకయితే తెలియదుగాని మన రైల్వేలు మాత్రం గొప్ప మానసిక విశ్లేషణ కేంద్రాలుగా కూడా పనిచేస్తాయి. చేస్తున్నాయి.

ఇప్పుడు నాకెదురయిన అనుభవం గురించి చెప్పే ముందు ఇది అత్యంత తాజాభావాల, జరుగుతున్న చరిత్ర రూపం అని కూడా చెప్పదలుచుకొన్నాను.

ఇంతకు ముందు నేను చెప్పిన తాత్విక విషయాల్లో ఎక్కువ భాగం చాలామంది చెప్పినవే.

అయినా అవన్నీ "అతని"కి చెందినవి:

"అతను" భారతదేశంలోనే పుట్టి, మద్రాసు మహానగరంలో ఎక్కడో, ఏదో వృత్తి చేసుకొంటూ పొట్టపోసుకుంటున్నాడని అతని మాటల వల్ల అర్థమవుతుంది. అతని మాతృభాష తమిళమే. అయితే తమిళం, తెలుగూ కలిపి గలగల మాట్లాడుతున్నాడు. జాతీయ స్రవంతిలో ఇదోభాగం అనుకుంటాను. ఒకో జాతికి చెందిన జీవనంలో కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. వారి భాష,

"ఉత్తమ స్త్రీ పురుషులు లేని దేశమును శ్రేయోరాజ్య మనలేము. చిత్త శుద్ధియు, శీల సంపత్తియు లేని సమాజమున ఉత్తమ స్త్రీ పురుషు లుండజాలరు. నైతికములగు పునాదులు లేనిదే శీలము వర్థిల్ల జాలదు. కాబట్టి జాతియొక్క సర్వతోముఖ వికాసమునకు, మానవ కళ్యాణమునకు, విశ్వ శాంతికి – మతము, ఆధ్యాత్మికశక్తి జీవ నాడులు"

– కల్లూరి చంద్రమౌళి

సంప్రదాయాలు, సెంటిమెంట్లు ఇతరుల మీద ప్రభావం చూపిస్తూ, ఇతరుల నుండి కూడా ప్రభావం పొందు తుంటాయి.

రైలు క్రిక్కిరిసి ఉంది. మద్రాసు వైపు ప్రయాణం చేస్తోంది. ఇంకా ఆంధ్రదేశపు సరిహద్దులు దాటలేదు.

ఓ ప్రవాహంలా సాగుతున్న అతని భావాల పరం పరలో కొన్ని భాగాలు చెప్పాలి.

"తిరుపతి ఎవరిది? ఆంధ్రులదా? తమిళులదా?"

అతను అది తమిళనాడుకు చెందిందని చాలాసేపు వాదించాడు. అందుకు మిగతా జనం మాత్రం ఊరుకోలేదు.

"మా వెంకటేశ్వర స్వామిలో ఏకోశానా తమిళం లేదు. మా పద్మావతిలో "తమిళం" లేదు. ఇంకా బీబీ నాంచారిలో సైతం తమిళం లేదు. ఆయన కేవలం తెలుగు వారి దేవుడు....దేవుడు" అని ఖచ్చితంగా ప్రకటించారు.

మెజార్టీ జనం అంత గట్టిగా అనేసరికి తమిళ సోదరుడు గలగలమంటూ నవ్వాడు.

వెంటనే ఆ టాపిక్ మారి దేశ రాజకీయాల మీదకు వెళ్ళింది. అందులో భాగంగా వాళ్ళ 'యం. జి. ఆర్' ఆంధ్రుల రామారావు మీదకు సాగింది. "మీ రామారావు గారు జనాని క్షేమిచ్చారు. సంపాదించుకొని వచ్చాడు. మా అన్నయితే రిక్షాతోళ్ళకి, బీదా బిక్కికి అదిచ్చాడు, ఇదిచ్చాడం"టూ వివరించాడు.

"ఆకాశవాణి" పేరు మారుస్తానంటే మేం అభ్యంతరం చెప్పాం, హిందీ మా మీద రుద్దితే మేం పోరాడాం. మీ తెలుగు వారంతా ఏం చేశారు, ఏం చేశారంటూ ప్రశ్నించాడు.

అవేగాక ఇంకా చాలా అజ్ఞాన పూర్వకమైన ప్రశ్నలు సైతం వేస్తున్నాడు. ఎవరో కొందరు జవాబులిస్తున్నా అతనిదే పైచేయిగా ఉంది.

నేను భారతీయుడ్ని తెలుగు వాడిని. అతని మాటల్లోని కొన్ని అంశాల పట్ల నిజంగానే నేను సిగ్గు పడుతున్నాను. మనలో ఐక్యత లేక పోవటం గురించి, మన వెనకబాటుతనం గురించి, మన కుంభ కోణాల గురించి, మన సినిమాల గురించి. అయితే ఇవన్నీ ఈ దేశంలో భాగమయిన ఈ రాష్ట్రం లక్షణాలు. ఇవి మనకే పరిమితం అయిలేవు. ఈ లక్షణాలు మద్రాసు నగరంలోనూ, బొంబేలోనూ కూడా ఉన్నాయి. మరింతగా ప్రాంతీయతత్వం ముదరటం ఏమిటి ?

స్టేషన్ వచ్చింది తాత్కాలికంగా ఆ తమిళుడి ప్రవాహం ఆగిపోయింది. జనం అంతా తోసుకుంటు న్నారు. దిగేవాళ్ళు దిగకముందే, ఎక్కేవాళ్ళు ఎక్కటం, ఎక్కినవాళ్ళు లోపలకు వెళ్ళకుండా ద్వారం దగ్గరే నిలబడి పోవటం, కొందరయితే మూటలు తీసుకొచ్చి అమాంతంగా జనం మీదకు విసురుతుండటంతో ఏర్పడుతున్న గందరగోళం తిరిగి అతనికి బ్రహ్మాండమైన అవకాశం కలిగించింది.

తన సుదీర్ఘమైన, అసంతమైన సంభాషణాక్రమాన్ని మద్రాసు నగరందాకా కొనసాగించాలనే పట్టుదల కలిగి ఉన్నాడేమోనని నా అనుమానం. అందుకు నాందిగా ముందు ఓ "చాయ్" చెప్పాడు. వాటిని అందించేవ్యక్తి ఛాయ్ నిండిన గ్లాసిచ్చి అరుచుకుంటూ ప్రక్కకు వెళ్ళాడు.

ఆ గ్లాసులోవి టీ లాగా కనిపించటంలేదు. ఎప్పటినుంచి మరగపెట్టాడో ఏమోగాని దానిమీద అకుపచ్చ వలయం ఏర్పడి స్పష్టంగా కనపడుతూంది. మామూలుగా పూరిళ్ళ మీద వాన కురిసినప్పుడు చూరువెంట జారిన నీళ్ళరంగులా ఉందా టీ. దాంట్లో టీ పొడి, చక్కెరలాంటి పదార్థాలు కూడా ఉండొచ్చు.

ఆ టీ వంక నిరసనగా చూసి మూడు గుక్కల్లో పూర్తిచేశాడు.

"ఏమండి.... ఛాయ్ ఇక్కడ ఇలా ఉందేమిటి?" అనడిగాడు.

ఇక్కడ అంటే ఆయన అర్థం ఆంధ్రలో అనే.

"ఎందుకు లాగాపయ్యా" అన్నాడు పక్కనాయన. "ఏం చెయ్యాల. పదహైదు గంటలనుండి ప్రయాణం చేస్తుంటే" అన్నాడు.

నాకు తెలిసినంతవరకు, నేను తిరిగిన ప్రాంతాల్లో మన రైల్వేల టీ, కాఫీలు ఎక్కడయినా పరమ దరిద్రంగా ఉంటాయి.

ప్రవాహం మొదలయింది.

'ఛాయ్' ఎంత దారుణంగా ఉందో వివరించాడు. అలాంటి వేడినీళ్ళు అమ్ముతున్న ఆ 'ఓనర్' గార్ని దుమ్మెత్తిపోశాడు. ఇలాంటి వారంతా దేశాన్ని దోచుకుంటున్నారని అభిప్రాయపడ్డాడు.

మాట్లాడుతూనే నిలబడిపోయిన మనుషుల్ని ముందుకు పొండి అంటూ నెట్టాడు. ఎవరో ఏదో అంటే కోపం వచ్చి 'నా నెత్తి మీద కూర్చోయ్యా' అని కోప్పడ్డాడు. 'మీరంతా ఎక్కారు బయట ఉన్నవారు ఏమైపోవాలి' అని ప్రశ్నిస్తూ 'మీ తెలుంగు వాళ్ళు ఇట్టా సేస్తిరేమి' అని బాధపడ్డాడు.

అతని మాటలు కాక ఇంకా కేకలు, గందరగోళం, కంపు బీభత్సంగా ఉంది-ఆక్కడ పరిస్థితి.

ఓ ముసలాయన వచ్చి సీటు ఇవ్వమని ప్రాథేయ పడుతున్నాడు. క్రిక్కిరిసి నట్లుగా కూర్చున్నారంతా. ఎవరూ మాట్లాడటం లేదు. కొంచెంసేపు అతని వంక, తెలుగు వారి వంక చూశాడు. ఆ పెట్టెలో, ఆ సీట్లలో అంతా తెలుగు వారే ఉన్నారని చెప్పటానికి వీలులేదు. ఎవరైనా ఉండొచ్చు.

తిరిగి మరో అవకాశం వచ్చింది.

## విద్య

"ముక్తిని సాధించేది విద్య అని ప్రాచీన కాలంనుంచి విద్యకు చెబుతున్న అసలైన అర్థం. కాని నేటి విద్య ముక్తిసాధకంగా లేదు సరిగదా, మనలను ఇంద్రియ దాసులుగా తయారుచేస్తోంది. పీడిత ప్రజానీకానికి సేవ చేయడానికి బదులు స్వార్థ ప్రవృత్తిని పెంపొందిస్తోంది. ఇందులో నుంచే శోషణ, సంఘర్షణ బయలుదేరుతున్నాయి. నేటి విద్యకు జీవితావసరాలకు ఏమీసంబంధం వుండటం లేదు. సాంఘిక పరిస్థితులకు ఏమాత్రం అది అనుకూలం కాదు. కేవలం అది పుస్తకాల వరకే పరిమితమై ఉండిపోతుంది. ఆ కారణంగా చదువుకున్నవాడు ఉద్యోగాన్వేషకుడై ఎక్కే గుమ్మం, దిగే గుమ్మంగా తయారయినాడు. కనుక ఉద్యోగానికి, విద్యకు ఉన్న సంబంధాన్ని త్రెంచివేయాలి. పరిశ్రమలతోటి, నైతిక భావాలతోటి దానికి సంబంధాన్ని ఏర్పరచాలి. న్యాయాలయాలకు వలెనే విద్య మీదకూడ ప్రభుత్వపు అధికారాంశాన్ని తొలగించి దానిని స్వయంశాసితంగా చేయాలి. కనుక ప్రస్తుత విద్యాస్వరూపాన్ని, విధానాన్ని మార్చవలసివున్నది. నేనాశిస్తున్న సంపూర్ణ విప్లవంలో ఒక భాగం విద్యారంగంలో విప్లవాత్మకమైన మార్పు."

—జయప్రకాశ్ నారాయణ

అతను లేచి ముసలాయనకు చోటిచ్చాడు. అంతవరకు బాగానే ఉంది. అతని మాటల పట్ల ఎలాంటి భావం ఉన్నా, అతని చర్యను మనస్ఫూర్తిగా అభినందించాను.

నిలబడి ఓ నిముషం అయ్యాక మొదలు పెట్టాడు.

"మీ తెలుగు వాళ్ళకు మీరు సీటివ్వరా ! తమిళవాడు ఇవ్వాలా ? ఏమి ఆంధ్రా సారూ...ఏమి ఐక్యత సారూ... ఇదే మా తమిళనాడులో అయితే ఇట్టా సేస్తుమా" అంటున్నాడు.

నాకెందుకో అరికాలి మంట నెత్తికెక్కింది.

ఎందుకనో అక్కడ ఎవరూ మాట్లాడటం లేదు.

"అయ్యా మేం వెధవలమే" అన్నాను.

అతను నా వంక ఆశ్చర్యంగా చూశాడు.

"లేకపోతే మా రాయలసీమకు నీళ్ళివ్వకుండా మీ మద్రాసుకు మా కృష్ణా జలాలు ఇస్తున్నాం. మాలో మాకు ఐక్యత లేదు. నిజమే. మీరయితే నోరు కలవారు కదా. అందుకని శ్రీలంక వెళ్ళికూడా 'తమిళదేశం' కావాలంటున్నారు. మాకన్ని తెలివి తేటలు లేవు. నిజమె" అన్నాను.

అతను ఓ క్షణం ఏం మాట్లాడలేకపోయాడు

"అదేమిసార్. శ్రీలంక వాండ్లు తమిళుల్ని సంపుతుండారు కదా" అన్నాడు.

"అవును తంబి, మద్రాసులో తమిళ తంబులింతా అందరికీ సీట్లు ఇస్తున్నారా ? నువ్వేమో తెలుగు జాతి నంతటినీ తిట్టేస్తున్నావ్. మీకు తెలుగు గంగ ఇవ్వటం మంచిదే. శ్రీలంకలో మీ వాళ్ళు చేసేది కూడా కరక్టే. ఎవడి కుంపటే దరిద్రం వాడికుంది. ఎవడికుంటే ప్రత్యేకతలు వారి కున్నాయి. మీ తమిళులనంటే నీకంత బాధ వేసింది. మా తెలుగు వారినంటే మాకు మాత్రం బాధ వెయ్యదా ? ఒక జాతి లక్షణాల్ని ఇలాంటి విషయాలు నిర్ణయించవు" అన్నాను.

అప్పటి నుండి అతను మాట్లాడటం మానేశాడు.

ఆ మౌనం ఆంధ్ర సరిహద్దులు దాటేంతవరకే అని నా కనిపించింది.

మొత్తం మీద ముందుగానే మీకు వివరించినట్లు, ఈ రోజు దేశంలో ఉన్న ప్రాంతీయ, కుల, మత తత్వాల్ని మన రైళ్ళలోనూ చూడొచ్చు ఏమంటారు ? 

# విశ్వసృష్టికి అశ్రువును ధారవోసిన
# మహాకవి శ్రీశ్రీ

'ప్రపంచాన్ని చూడలేని
కవిత నిజం చూపదు
ఇసకలోన తల దూర్చిన
ఉష్ట్ర పక్షి బాపతు ''

అనే సిద్ధాంతాన్ని నిశ్చయంగా నమ్మి, నిర్భయంగా ఆచరణలో చూపిన కవి శ్రీశ్రీ. "కవిత్వాన్ని తూచవద్దు. అనుభవించి పలవరించమ"ని చలానికి చెప్పిన శ్రీశ్రీ, ఆ కవితా శిల్పాన్ని చెక్కడానికి ముందు తానెంత కలవరించాడో, ఆతని కవిత చదివితే అర్థమవుతుంది. "ఏవో, ఏవేవో, ఘోషలు వినబడు తున్నాయ్! గుండెలు విడిపోతున్నాయ్" అంటాడు. "నిద్రకు వెలియై, నేనొంటరినై, నా గది లోపల చీకటిలో, చీకటి లోపల నా గదిలో, నా గదిలో, చీకటిలో...." అంటూ పలవరిస్తాడు. "జగమంతా నిదుర మునిగి, సద్దణిగిన నడిరాతిరి, నీలోనే నీ వేదో, ఆలకించుతావ్! శ్రీనివాసరావ్! శ్రీనివాసరావ్!" అని తన్ను తాను ప్రశ్నించుకుంటాడు. 'విన్నవీ, కన్నవీ, విన్నవించాలని మాటలకై వెదుకాడగబోతే, అవి పుంఖానుపుంఖంగా శ్మశానాల వంటి నిఘంటువుల దాటి, వ్యాకరణాల సంకెళ్ళు విడిచి, ఛందస్సుల పరిష్వంగం వదలి వడివడిగా వెలువడినయ్.'

ఇక ఆక్షణం నుండి శ్రీశ్రీకి ప్రపంచంలోని ప్రతి వస్తువు తనదయింది. ప్రతి మనిషీ తన వాడయ్యాడు. 'కుక్కపిల్లా, అగ్గిపుల్లా, సబ్బుబిళ్ళా, హీనంగా చూడకు దేన్నీ, కవితా మయమేనోయి అన్నీ' అంటాడు. కూటి కోసం తల్లి మాటను పెడచెవిన బెట్టి పట్టణానికి వచ్చిన బాటసారి, దారి ప్రక్క చెట్టు క్రింద అరిన కుంపటిలా కూర్చుని ఉన్న ముదుసలి, అప్పులవాళ్ళకూ, బిడ్డల ఆకలికి మధ్య తల్లడిల్లిన సంసారి, కూలి, మాలి, రైతు, అందరూ అతని వాళ్ళే! అయితే వాళ్ళ జీవితాల నిండా నీడలే! యుగయుగాల దోపిడిలో, నరనరాల రాపిడిలో, వగచూరిన, పొగచూరిన శాసనాల జాడలే!

డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

శ్రీశ్రీ గుండె రగిలింది. అందుకని సమాజాన్ని "అభాగ్యులంతా, అనాథులంతా, అశాంతులంతా, దీర్ఘశ్రుతిలో తీవ్రధ్వనితో విప్లవ శంఖం వినిపిస్తారోయ్" అని హెచ్చరిస్తాడు. "చిరకాలం జరిగిన మోసం, బలవంతుల దౌర్జన్యాలూ, ధనవంతుల పన్నాగాలూ, ఇంకానా, ఇకపై చెల్లవ్" అని సవాలు చేస్తాడు. తన సోదరుల వైపు ఆత్మీయంగా చూస్తూ, "వినపడలేదా మరో ప్రపంచపు జలపాతం" అని ప్రశ్నిస్తాడు. "పతితులారా, భ్రష్టులారా! దగాపడిన తమ్ములారా; మీకోసం కలంపట్టి, ఆకాశపు దారులంట అడావుడిగ వెళిపోయే, అరచుకుంటూ వెళిపోయే జగన్నాథుని రథ చక్రాల్! రథ చక్ర ప్రళయ ఘోష భూమార్గం పట్టిస్తాను. భూకంపం పుట్టిస్తాను' అని శపథం చేస్తాడు.

శ్రీశ్రీ తీసుకు రాదల్చుకున్న ఈ విప్లవానికి సింధూరం, రక్తచందనం, బందూకం, పులి చంపిన లేడి నెత్తురు, ఎగరేసిన ఎర్రని జెండా, ఘాటెక్కిన గంధక ధూమం,

# బడబాగ్ని గీతం

- ఎమ్వీయల్

శ్రావణ మేఘాలు
ఎక్కడో లేవు
నా కళ్ళలోనే వున్నాయి
అయినా
ఎద దప్పిక తీరటం లేదు
గుండె మంట ఆరటం లేదు.
బండెడు పుస్తకాలు మోస్తూ
బడికెళ్ళి వాడిపోతున్న పిల్లల్ని
డిగ్రీలు చేతబట్టుకుని తిరిగి
తిరిగి వాడిపోతున్న యువకుల్ని
పైవాడి దయ రాక, ప్రాపకం లేక
గానుగెద్దులై నిరాశపడుతున్న ఉద్యోగుల్ని
బండచాకిరీ చేస్తున్నా పస్తుంటూ
ఎండదెబ్బకి ఎరుపెక్కుతున్న కూలీల్ని
చిరునవ్వు చిరునామా అడుగుతున్న
కేకలు రాని ఆకలి పేగుల్ని
చూస్తున్నప్పుడు
నా కళ్ళలోనే వున్నాయి
శ్రావణ మేఘాలు.

కాని
సమాజం చూస్తుందేమో
ఎగతాళి చేస్తుందేమో
అన్న భయంతో
కనుకొలకుల చెలియలికట్ట
దాటకుండా లోపలికే కురుస్తున్నాయి
అయినా
ఎద దప్పిక తీరటం లేదు
గుండె మంట ఆరటం లేదు.
శ్రావణ మేఘాలు
ఎక్కడో లేవు
నా కళ్ళలో
నీ కళ్ళలో
అందరి ఆకళ్ళలో
లోలోపలికే కురుస్తున్నాయి.



రాబందుల రెక్కల చప్పుడు, పొగగొట్టపు భూంకార ధ్వని, చెలరేగిన జన సమ్మర్దం—సాధనాలు ! శ్రీశ్రీ కలం చిందులకు అవి సిరా బిందువులు !

శ్రీశ్రీ ఆవేశం కట్టలు తెంచుకున్న క్షణాన భాష గూడా ధావానికి శిరసు వంచి సమస్కరించి ప్రక్కకు తప్పుకుంటుంది. "అరుణా ! ఝా ! ఝటక్ ! ఫటక్ ! హింసనచణ ! ధ్వంసరచన ! హింసరచన !"

చలం అన్నట్లు "ప్రపంచపుబాధ అంతా శ్రీశ్రీ బాధ" అందుకే అతడు "నేను సైతం, ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను" అంటాడు. "నిజంగానే నిఖిల లోకం నిండు హర్షం వహిస్తుందా ? మానవాళికి నిజం గానే మంచి కాలం రహిస్తుందా ?" అని ఆశగా ఆబగా ప్రశ్నిస్తాడు.

శ్రీశ్రీ కవిత్వం సమాజాన్ని ప్రభావితం చేసిందా ? శ్రీశ్రీ కన్న కల ఫలించిందా ? నిజంగా "నరజాతికి పరివర్తన ! నవ జీవన శుభ సమయం ! అభ్యుదయం" వచ్చిందా ?—ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పవలసిన బాధ్యత నేటి యువతరం మీద ఉన్నది. కొంపెల్ల జనార్ధన రావు సెలవంటూ ఈ లోకాన్ని వదలి వెళ్తే శ్రీశ్రీ "నీ సాహసం ఒక ఉదాహరణ ! నీ జీవితమే ఒరవడి ! నిన్న వదలిన పోరాటం నేడు అందుకొనక తప్పదు ! కాపున ఈ నిరాశామయలోకంలో కదన శంఖం పూరిస్తున్నాను" అన్నాడు. శ్రీశ్రీ మరణించాడని తెలిసాక, బరువెక్కిన గుండెతో "దేన్ని వెదుక్కుంటూ వెళ్ళావోయ్ నేస్తం ! ఎంత అన్యాయం చేశావోయ్ నేస్తం" అనుకున్నాడు ప్రతి రసహృదయుడు.

అయితే ఓ మహా కవీ ! నీవు మాలో ఆవేశిస్తావా ? నీ కోసం మహాప్రస్థానం మరల సాగుతుందా ? సమాధానం చెప్పవూ ?



## మనకు తెలియని ప్రపంచం

# పెళ్ళికోసం 13 వేల మైళ్ళు ప్రయాణం చేసి వచ్చిన అమెరికన్స్

అమెరికాలోని టెక్సాస్ రాష్ట్రానికి చెందిన లక్షాధికారిణి కేమిల్లా ఫ్లైషర్ అనే యువతి ఇదివరకొకసారి భారతదేశం సందర్శించింది. భారతీయ సంస్కృతి, రాజస్థాన్ రాష్ట్ర రాజధాని జైపూర్ ఆమెని ఎంతో ఆకట్టుకున్నాయి.

ఆమె అమెరికాలోని బోస్టన్ నగరంలో నివసించే హెర్బర్ట్ మల్లర్డ్ ఆనే వ్యాపారస్తుడితో ప్రేమలో పడింది. సంవత్సరం ప్రణయం తర్వాత ఇద్దరూ వివాహం చేసుకోడానికి నిర్ణయించుకున్నారు.

అందరిలా కాదు.

వధువు కెమిల్లా తన ప్రియుడితో ఇలా చెప్పింది. భారతదేశంలో, భారతీయులలాగా, హిందూమత ఆచారాల ప్రకారం వివాహం చేసుకుందామని. ఆ కోరిక ఎంతో వింతగా తోచింది అతనికి. భారతదేశం మీద కొన్ని పుస్తకాలని తెప్పించుకొని చదివాడతను. చివరికి ఆమె కోరికను అంగీకరించాడు.

ఫలితంగా వివాహం చేసుకోడానికి వారిద్దరూ అమెరికా నించి కొన్ని వేల మైళ్ళ దూరంలో వున్న మన దేశంలోని జైపూర్ చేరుకున్నారు. వారితో పాటు చాలామంది బంధువులు, స్నేహితులు కూడా.

చారిత్రాత్మకంగా జైపూర్‌లో ప్రాముఖ్యం గల సిసోడియా రాణి మహల్‌లో వారి వివాహం జరిగింది. ఆ గృహాన్ని ప్రత్యేకంగా అలంకరించారు. వైదిక మంత్రాలతో వారి వివాహం జరిగింది. జైపూర్‌లో వున్న కల్నల్ గోవింద్‌సింగ్, ఆయన భార్య కన్యాదానం చేసారు. ఆ వివాహన్ని వార్తల్లో కవర్ చేసేందుకు దేశ విదేశ పత్రికా ప్రతినిధులు అనేకమంది హాజరయ్యారు. అమెరికానించి టి. వి కెమేరామన్ వచ్చి ఆ కార్యక్రమం యావత్తూ టి. వి. సినిమాతీసారు అమెరికన్ టి. వి. లో ప్రసారం చేయడానికి. ఆ వివాహానికి "మేరేజ్ ఆఫ్ ది ఇయర్" గా పేరు పెటారు వారు.

జైపూర్ మహారాణి గాయత్రీదేవి, ఇటాలియన్ కౌంటెస్ బియాంక లొవటెల్లి, పెర్సిస్ కంబాట అనే రచయిత్రి మొదలైనవారు ఈ వివాహానికి హాజరయ్యారు.

వివాహానంతరం ఇండియన్ కంటినెంటల్, చైనీస్ భోజనం, ఆ తర్వాత కథక్ నృత్యం, జానపద గీతాలు మొదలైన సాంస్కృతిక కార్యక్రమాలు జరిగాయి.

భారతీయ ఆచారం ప్రకారం వివాహం చేసుకో గలగటం తమకెంతో సంతోషం కల్గించిందని దంపతులిద్దరూ పేర్కొన్నారు.

హనీ మూన్‌కి ఇద్దరూ టిబెట్ వెళ్ళారు. ★

---

"రచయిత ఒకరికి బానిస కారాదు. రచయితలు ప్రపంచ శాసన కర్తలు."

- నోరి నరసింహశా

# అలకపాన్పు

— పింగళి త

అలక పాన్పు లక్షణం అల్లుడ్ని అలగమనిచెప్పడమే గదా. దొరికిందే ఛాన్సు అని అల్లుడుగారు రాయితీగా అలిగేస్తారు. అలక తీర్చటానికి మామగారు కుంగిపోవటం రివాజు.

"అసలు అలక పాన్పు ఎవరు వేయమన్నారు ? మా అమ్మాయి ఫలానా చదువుకుంది, ఓ ఎనిమిదో, పదో వేలు యిస్తాం, అంతకంటే నా చెయ్యి లేవదు, అమాం బాపతులు అందులోనే" అని సంబంధం కుదుర్చుకున్న ఆడపిల్ల తండ్రి....అలక పాన్పు ఎక్కి ఓ స్కూటరో, కారో కావాలన్న అల్లుడ్ని చూసి "హరీ" మన్నా ఆశ్చర్య పడక్కర్లేదు.

పాన్పువేసి అలగమన్నాక కోరినవి యివ్వాలి ! మరి తప్పుతుందా ? ఇవ్వాలంటే ఏం తెచ్చి యిస్తాడు ? అమ్ముకుందుకు వుంటున్న ఇల్లు సొంతం కాదు. పోనీ అద్దె ఇల్లు అమ్మేద్దామంటే ఇంటావిడ ఒప్పుకోదు ! పొలం రెండెకరాలుంటే పెద్దమ్మాయి పెళ్ళికి ముడుపయి పోయింది. ఇప్పుడు చిన్నమ్మాయి కాపురం ఎట్లా ? అల్లుడ్ని అలకపాన్పు దింపటం ఎలా ?—ఓ తండ్రి బాధ వర్ణనాతీతం.

పోనీ అప్పు చేద్దామంటే ఎలా తీర్చాలి ? అబ్బాయి చదువు సగంలోనే వుంది. తనకీ వృద్ధాప్యం వస్తోంది. ఈ సమస్య పరిష్కారమెలా ?

అల్లుడు చదువుకున్నవాడు, సంస్కారవంతుడు, ఏదో పూర్వాచార ప్రకారం "అలక పాన్పు వేడుక" అంటే భార్య ముచ్చట కాదనలేక సరేనంటాడు భర్త.

ఆ అలుక కాస్త "నాకు స్కూటర్ కావాలి" అన్నది యిప్పుడు గొంతుకు పట్టుకుర్చుంది.

లాభం లేదు. కాళ్ళ బేరానికి పోవాలి కాబోలు. ఆడపిల్లని కన్న ఆనందానికి (నేరానికి) తండ్రి -

"నాయనా నువ్వు కోరావు, బాగానే వుంది. ఇవన్నీ మనం ముందుగా అనుకోలేదుకదా. కట్నం కానుకలు, మనం అనుకున్నట్లు వెండి కంచం, వాచీ, లాంఛనాలన్నీ ముందే ముట్టచెప్పాం కదా ! ఇలా కోరుతావని తెలిస్తే "అలక పాన్పు మా ఆచారం కాదు" అని వేయక పోదుము. పోనీ బొమ్మ స్కూటర్ కొనిస్తాం"— పిల్ల తండ్రి ఆవేదన,

"వీల్లేదండీ"—జవాబు మగ పెళ్ళివారి తరపునించి.

"పోనీ దాని బదులు ఓ అయిదు వందల్లో వచ్చేది యింకేదన్నా కోరుకో"—పిల్ల తండ్రి అర్థింపు.

ఇలా ఈనాడు చాలా పెళ్ళిళ్ళలో జరుగుతూనే వున్నాయి. అల్లుడు కాస్త మంచివాడై, పెద్దల ప్రోద్బలం చేత పెద్ద కోరిక కోరినా, మామగారి స్థితిగతులన్నీ ఆలోచించి "ఆల్టరు" చేసుకునే వాడూ వుండచ్చు. మూర్ఖుడు. మొండివాడు అయితే కోరినది తీరేదాకా కాపురం చెయ్యననీ అనచ్చు, పాన్పు దిగననీ అనచ్చు...మనం చెప్పలేం! ఆ పెళ్ళికూతురి అదృష్టం మీద ఆధారపడిందనే అనుకోవాలి.

అలక పాన్పు, ఆడబడుచులకి చీరలు, అయిన వాళ్ళకి బట్టలు అని కొన్ని చోట్ల ఆచారం. ఆ చీరలు నచ్చ లేదనే ఆడబడుచుల మూతి ముడుపులు, ముసలమ్మల వ్యాఖ్యానాలు....సంతోషంగా మొదలయిన పెళ్ళి అలగమ కోపడాలు, కళ్ళనీళ్ళతో అంత మవుతుంది.

అర్థాంగిగా ఆడపిల్ల కావాలనుకున్న వాడు అలక పాన్పు కోసం ఏడవ కూడదు. పెళ్ళికి అంటూ వంక పెట్టుకుని బంధు బలగాన్ని అల్లరి చేసే పెద్దలని ఆహ్వానించటం బావుంటుందా ?

కోరిన పిల్లని పెళ్ళి చేసుకుని, పెళ్ళికి వ్యయం చేసే డబ్బుతో సంసారం సాగిద్దామనే తలంపు ఈనాటి యువ తరానికి కలగటానికి ఎన్నితరాలు పట్టుంది ?

"చదువు ముఖ్యం, ఉద్యోగం ముఖ్యం" అని అన్నీ సంపాదించుకున్న ఆడ పిల్లల గతి ఎన్నాళ్ళకి ఆనంద మయమైన మార్పుని తెచ్చుకుంటుంది. అలక పాన్పులు లేని, అప్పగింతలు లేని, ఆర్భాటాలు లేని పెళ్ళిళ్ళు జరిగినప్పుడు—అని కలలు కనే ఆడపిల్లల కోరిక కోరికేనా !

# విలువ

"క్లాస్త వేగంగా కట్టించండి, ఇప్పటికే చాలాఆలస్య మైంది. ఈ పనయితే వెంటనే అవసరంగా వేరే పని మీద వెళ్ళాలి"

అన్నాడు జగన్మోహనరావ్.

"ఒక్క నిముషం సార్, కట్టించేస్తాను. ఫస్ట్ తారీఖు కదండీ, అందుకే కొంచెం రద్దీగా ఉంది"

అన్నాడా కొట్టు యజమాని.

జగన్మోహనరావ్ ఒక సంస్థలో ఆఫీసరు. ఆరోజు ఇంటికి కావలసిన సరుకులు కొనుక్కుందుకు ఆఫీసు నుండి సరాసరి వెచ్చాల కొట్టుకు వెళ్ళాడు. కొట్టు చాలా రద్దీగా ఉంది. ఆయనక్కడకు వచ్చి సుమారు అరగంట దాటుతుంది. ఒకరి తర్వాత ఒకరికి ఆదరబాదరాగా సరుకులు కట్టి పంపుతున్నాడు ఆ కొట్టు యజమాని. కొంత సేపటికి జగన్మోహనరావ్ చీటి కూడా వరుసలో వచ్చింది. చీటి లోని వస్తువులు ఒక్కొక్కటే కట్టిస్తు న్నాడు షావుకారు.

ఇంతలో రిక్షాలో ఆ కొట్టు వద్దకు వచ్చిన ఒకాయనను చూసి—

"ఒరేయ్, అహోబలరావ్ గారొచ్చారు, గభాల్న ఒక కూల్ డ్రింక్ తీసుకురారా" అని పని కుర్రాడికి చెప్పి యజమాని హడావిడిగా లేచి ఆయనకు ఎదురు వెళ్ళి

"నమస్కారం సార్, బాగున్నారా ? ఏంటి, సామాన్ల కోసం వచ్చారా. కాకితో కబురెడితే కట్టి పంపనాసార్. సరే, సంచీ ఇటివ్వండి, అన్నీ కట్టి కుర్రాడితో ఇంటికి పంపేస్తాను " అన్నాడు.

ఇంతలో కుర్రాడు డ్రింక్ తీసుకురాగా

"తీసుకోండి సార్" అంటూ ఎంతోవినయంగా అందిం చాడు. ఆవచ్చినాయన రిక్షాలోనుండే అందుకొని త్రాగి—

"వేగంగా పంపండి" అంటూ ఒక సంచీ, చీటీ షావు కారుకిచ్చాడు.

"అలాగేసార్" అంటూ అవి తీసుకుని కుర్రవాడి చేతికిచ్చి

"రేయ్, అయ్యగారికి ఈ చీటీలోని సరుకులు వెంటనే జాగ్రత్తగా కట్టరా" అని పురమాయించి చేతులు కట్టుకు నిల్చున్నాడు.

"వస్తానూ.... పోనీవోయ్ రిక్షా" అన్నాడాయన.

"మంచిది, దయుంచండిసార్" అంటూన్న షావు కారు మాటల మధ్యలోనే రిక్షా కదిలింది.

వ్యాపారి తిరిగి కొట్టులో కూర్చున్నాడు. తతంగ మంతా పూర్తయేసరికి సుమారు మరో పావుగంట గడి చింది. ఒకసారి వాచి చూసుకుని జగన్మోహనరావ్

"ఏమండీ షావుకారుగారూ, నేనొక సంస్థలో ఆఫీ సర్ని. నేనిక్కడకొచ్చి సుమారుగా ఒక గంట అవు తుంది. అప్పటినుంచి కూర్చున్నా మీరు ఒకరి తరువాత ఒకరికి సరుకులు కడుతూ నన్ను ఇంతసేపు ఇక్కడ ఉంచేసారు. అదే, ఎవరో గుమాస్తా అనుకుంటాను.... వచ్చేసరికి వెళ్ళి ఊరంతా హంగామా చేసి ఆయనను పంపేసి ఆయన సరుకులు కట్టించి ఇంటికే పంపుతా సన్నారు. ఇదోకొంత ఆలస్యం మాకు. ఏమిటండీఇది? ఎందుకీ తేడా?" అనడిగాడు.

"ఏం చెయ్యమంటారు సార్! ఆ డిపార్ట్‌మెంట్‌తో మా కుండే అవసరం అలాంటిది. కానీ, ఒకటి మాత్రం నిజం సార్. మిమ్మల్ని మేము గౌరవించకపోయినా అగౌరవించం సార్, అదే వాళ్ళనైతే ఎదురుగా పొగిడి గౌరవించి వెనక తిట్టుకుంటాం సార్. అదేనండీ మీకు, వాళ్ళకూ మేమిచ్చే విలువలో తేడా" అని తన పనిలో మునిగిపోయాడు.

జగన్మోహనరావు ఆలోచనలో పడ్డాడు.

— పి. వి. డి. యస్ మూర్తి

# కులం కావాలా?

"కులం కులం అంటూ కుత్సితాలు పెంచుకోకు" అనే పాట చాలామంది వినే వుంటారు. కవుల కలాలు కమ్మని కవితలు రాస్తే, గాయకుల గళాలు శ్రావ్యంగా ఆ గీతాలను ఆలపిస్తుంటాయి; చెవి పుటలను చేరిన పాటలు మనస్సుని మథన పెట్టకుండా సాగరంలో చేరే నదుల్లాగా సాగిపోతుంటాయి. మరి ఎవరికోసం యీ వ్రాతలు ? కవుల వ్రాతలు, నాయకుల వుపన్యాసాలు ఏనాటినుంచో సాగుతున్నా సమాజం వారి భావాలను ఏనాడు స్వీకరించ లేదు, స్వీకరించదు అనే భావన కూడా ఎందరినో బాధ పెడుతున్నది.




వ్యక్తిగత జీవితానికి పరిమితం కావాల్సిన "కులం" సామాజిక, రాజకీయ, ఆర్థిక, ధార్మిక, విద్యా, సాంస్కృతిక రంగాలను కలుషితం చేసి, జన జీవనంలో వైషమ్యాలను సృష్టిస్తున్నది; అని ఎందరో వాపోతున్నారు. అందుకే బెర్ట్రెండ్ రస్సెల్ "మానవుడు పక్షివలె ఆకాశంలో ఎగరటం నేర్చాడు, చేపవలె నీటిలో ఈదటం నేర్చుకున్నాడు. కాని మానవుడిలాగా భూమ్మీద మెలగటం నేర్చుకోలేడు" అని అంటాడు. ఎవరు ఎంతగా ఆవేదన పడినా కుల రక్కసి విష కోరలు సమాజపు నలు దిక్కులనూ తాకుతూనే వున్నాయి.

వ్యక్తి హృదయాన్ని విశాలమయం కాకుండా అడ్డుకునే శక్తి అజ్ఞానానికుంది. అందుకే ప్లాటో అంటాడు "చదువుకోక పోవడం కంటే అసలు జన్మించకపోవడం మంచిది. ఎందుకంటే దురదృష్టానికి మూలహేతువు అజ్ఞానం". అంటే విద్య ద్వారా వివేకం, విజ్ఞానం ఒనగూడాలనే కదా అర్థం. కాని విద్యకు నిలయాలుగా భాసిల్లుతున్న విద్యాలయాల స్థితి ఏమిటి? బాల్యంనుంచే కుల బోధన చక్కని రీతిలో కొనసాగుతున్నది. పుస్తకాల అట్టల మీద 'అంటరానితనం మహాపాపం' అన్న అక్షరాల భావం అర్థంకాని బాలుడు తండ్రిని అడిగితే ఏం జవాబు చెప్పాలి? అసలు అంటరానితనమంటే ఏమిటో దానికి కారణమయిన కులవ్యవస్థ అంటే ఏమిటో కూలంకషంగా వివరించాలి. అంటే చిన్నారి ఆ పసికందు మనస్సులో విషబీజాన్ని నాటటమే కదా! మరో మాటలో ఒకటవ తరగతి నుంచే కులాల గురించిన బోధన కొనసాగుతున్నదన్నమాట. అలాగే ఆర్థిక బలహీనులకు యిచ్చే ఉపకార వేతనాలు కూడా కుల ప్రాతిపదికమీద పంచిపెట్టబడుతున్నప్పుడు, ప్రతిభకు ప్రాతినిధ్యం లేని ఉద్యోగ నియామకాలు జరుగుతున్నప్పుడు కులతత్వం నిర్మూలించబడుతుందని ఎవరయినా అంటే అది సమాజాన్ని మోసం చేయడమే అవుతుంది. ఆదర్శం, ధ్యేయం కేంద్రంగా అధ్యయనం జరగవల్సిన కళాశాలలు, విశ్వవిద్యాలయాలు, నేడు కులసంఘాల నిలయాలుగా మారిపోయాయి. వర్గాలుగా విభజించబడిన విద్యార్థిలోకం కులాలవారి టీ పార్టీలు, డిన్నర్లు ఏర్పాటుచేసుకొని సంతోషపడుతున్నది. మెడికల్, ఇంజనీరింగ్ కళాశాలల్లో యీ దుస్థితి విలయతాండవం చేస్తున్నది.

రాజకీయ రంగం కూడా యిందుకు ఏమాత్రం భిన్నంగా లేదు. సమాజ సమైక్యతకు, రాజ్యాంగ పరిరక్షణకు కృషి చేయవల్సిన బాధ్యత ప్రధానంగా రాజకీయ వాదులది. మరి యివ్వాళ, కులాల పేరు మీద ఎన్నికల ప్రచారం తద్వారా విజయం–మరి యీ విజేతలంతా విశాల సమాజ ప్రతినిధులుగా ఎలా పరిగణింప బడతారు ? ఎలా వీరంతా సమాజ సంఘటనకు కృషి సల్పగల్గుతారు ? యివన్నీ ప్రశ్నలే ?

యాత్రికుల ఏర్పాటుకై ధర్మశాలలు, వివాహాది శుభ కార్యాలకు వుపకరించే సత్రాలు నేడు కులాల వారీగా కేటాయించ బడుతున్నాయి. కులం పేరుతో వున్న సత్రాలు, కళ్యాణ వేదికలు మనందరికీ తెలిసినవే కదా ?

సామాజిక సేవా కార్య కర్తలుగా పేరు పొందిన ప్రముఖులు కూడా కులానికి అతీతంగా మసల లేక పోతున్నారు. ధార్మిక సంస్థలు, మహిళాభ్యుదయ సంఘాలు కూడా కులం కేంద్రంగా పని చేస్తుంటే యీ సమాజానికి దిక్కేమిటి? ఒకేపని చేసే కార్మికులు, వాళ్ళ హక్కుల పరిరక్షణ కోసం పూనుకున్న కార్మిక సంఘాలు, మేధస్సు కేంద్రంగా వ్యవహరించ వల్సిన వున్నత వుద్యోగులు, అత్యున్నత స్థానంలో వుండి సమాజ సమైక్యతా రక్షణకు వ్యూహ రచన చేయవల్సిన మేధావులు, చివరికి సర్వసంగ పరిత్యాగు లయిన సన్యాసులు కూడా కుల తత్వానికి తమ శక్తి వంచన లేకుండా సేవ చేస్తున్నారంటే ఆశ్చర్య పడాలా ? ఆనందించాలా ? కులాల వారీగా స్వాములు, సన్యాసుల పీఠాలు-వీరంతా ఆ పరమాత్ముడు ప్రసాదించిన గీతామృతాన్నే ప్రవచిస్తూ వుంటారు. రామాయణ, భారత గాధల్లోని రామ, కృష్ణుల కథలే వీరి ప్రసంగాలకు వూపిరి. ఆత్మ పరమాత్మ తత్త్వాల వివరణకే ఎంతో ప్రాధాన్యం యిచ్చే వీరు కుల తత్త్వాన్ని నిరసించే స్థితిలో లేరు.

మన వేదాలుగాని, మన ధర్మశాస్త్ర గ్రంథాలుగాని కులతత్వాన్ని ప్రవచించలేదు. ఏ కులాన్నీ అల్పంగా, హీనంగా చిత్రించలేదు. క్షత్రియ వంశజుడయిన రాముణ్నే జాతి అంతా దైవంగా భావిస్తున్నది, పూజిస్తున్నది. యాదవ కులజుడయిన శ్రీకృష్ణుని బోధామృత 'గీత' అందరికీ పూజనీయం. ప్రపంచ వ్యాప్తంగా ఎందరో గీతామృత ధారను గ్రోలి ధన్యులవుతున్నారు. సోషలిస్ట్ దేశాలు అని పిలువబడుతున్న రష్యా, చైనాలు తమతమ భాషల్లోకి 'గీత'ను అనువదించి వారి జాతికి అందిస్తున్నాయి. పాశ్చాత్య వ్యామోహంలో వున్న మనకు 'గీత' పట్ల అభిమానం సన్నగిల్లినా ఆదేశవాసులు 'గీత' బోధనలను అనుసరించే ప్రయత్నం చేస్తున్నారు. ఎంతటి భగవానుడయినా విగ్రహ పాదాలకే మొక్కరిల్లుతున్నాం. అంటే అధిక అధమ అనే భేదాలకు తావు లేదనే కదా! చండాలుడయిన ధర్మ వ్యాధుడే కదా ధర్మ సూక్ష్మాన్ని వివరించింది! ఇన్నీ తెలిసిన మనకు కుల తత్వమా ఆరాధనాకేంద్రం?

ముక్త కంఠంతో దీనిని నిరసించాలి. సమాజాన్ని పరమేశ్వర స్వరూపంగా ఆరాధించాలి. అంతరంగంలో ప్రేమామృతాన్ని నింపుకొని అందరితో సహజీవనం చేయ గల్గాలి. కుల, వర్గ, భాషా వైషమ్యాల దుర్గంధాన్ని, ధర్మమనే పన్నీటిలో పారద్రోలి ప్రేమైక్య సౌగంధాన్ని వెద జల్లాలి. ఈ ఆశయ సాధన కృషే సమాజ జీవన మనుగడకు సోపానం కాగల్గుతుంది. ★

## దావులూరి రాధాకృష్ణమూర్తి

శ్రీ దావులూరి రాధాకృష్ణమూర్తి కృష్ణా జిల్లా పామర్రు నివాసి. కేరళ రాష్ట్రంలోని కాలికట్‌లో నిర్వహించిన జాతీయ చాంపియన్ యోగాసనముల పోటీలలో మనరాష్ట్రము నుండి పాల్గొనిన 11మందిలో శ్రీ దావులూరి రాధాకృష్ణ (పామర్రు) శ్రీ జి. వెంకట శ్రీధర్ (రాజమండ్రి) జూనియర్స్‌లో 5వ స్థానం పొందారు. ఇది మనకు గర్వకారణం. శ్రీ దావులూరి వేమన యోగా రీసర్చి ఇనిస్టిట్యూట్‌లో సర్టిఫికెట్ కోర్స్ చదివారు. కన్యాకుమారి లోని వివేకానంద కేంద్రంలో శిక్షణ పొందారు. వీరు వివిధ రాష్ట్రములు మరియు అండమాన్స్ పర్యటించి యోగ విద్యను ప్రచారం చేసారు. వీరు ప్రస్తుతం పామర్రులో "వివేకానంద విజ్ఞాన విహార్" సంస్థను స్థాపించి బాల బాలికలకు యోగ విద్యను నేర్పుతున్నారు. వీరు మన "శ్రీవాణి"పత్రికలో "యోగవిద్య"ను గురించి వ్యాసములు వ్రాయడానికి అంగీకరించారు. వీరి అమూల్యమైన వ్యాసములు చదివి, ఆచరించి ఆరోగ్యమును కాపాడు కొంటారని ఆశిస్తున్నాము.

# ఉమ్మెత్త చెట్టు

యస్. యన్. దుర్గారావు

ఈ ఉమ్మెత్త చెట్టు గజమెత్తువరకు పెరుగును. ఈ చెట్టు హిందూ దేశములో ఎక్కువగా దొరుకును గానీ మలబారు, కాశ్మీరులలో మాత్రం విశేషముగా దొరుకును. ఆకులు నీటి వంగ ఆకులను పోలియుండి పొడవుగా కన్పింపుచుండును. కాయలు నిమ్మకాయంత ఉండును. కాయలకు ముండ్లు ఉండును. ఎండిన కాయలు పగిలి, గింజలు కన్పింపుచుండును. ఉమ్మెత్త మొక్కలలో తెలుపు, ఊదా, నలుపు వర్ణములుగల మూడు జాతులున్నాయి. ఆయా భాగములు (పుష్పాలు, కాడలు మొ॥) రంగులను బట్టి జాతిని నిర్ణయించవచ్చును. ఆకు, కాయ, గింజలు, వేరు మిక్కిలి ఉపయోగకరములు. నల్ల ఉమ్మెత్త ఆకులు, కాడలు, కొమ్మలు, పుష్పాలు, కాయలు నలుపు రంగు (సుమారు ఊదా రంగు)ను పోలి వుంటుంవి. నల్ల ఉమ్మెత్త మిగిలిన ఉమ్మెత్తల కంటె త్వరగానూ, విశేషముగానూ పనిచేయును అని గ్రంథ కర్తలు పూర్వమే తెలిపియున్నారు.




ఉమ్మెత్తాకుల రసము బోడి తలపై మర్ధనా చేయుచుండిన బట్టతలపై వెంట్రుకలు మొలుచును. ఉమ్మెత్త వేరు నీటిలో అరగదీసి కంటికి కాటుకగా పెట్టిన వాత నేత్ర రోగములు పోవును; ఉమ్మెత్త గింజలు మెత్తగా నూరి, అవ నూనెలో వేసి కాచి రాసిన కాళ్ళ పగుళ్ళు తగ్గును; ఉమ్మెత్తాకు రసము, ఆవనూనె, షోదుగ వేరు పసుపు కలిపి తైల పక్వముగా కాచి చెవిలో వేసిన కర్ణ నాడులు కట్టును; ఉమ్మెత్త గింజలు, పిప్పళ్ళను దిన దినము క్రమాభివృద్ధిగా చల్లని నీటితో నూరి సేవించిన దారుణమైన బోదకాలు రోగము సందేహరహితంగా తగ్గునని "వంగసేన"లో వ్రాయబడి యున్నది. ఉమ్మెత్త వేరును, తెల్ల గలిజేరు వేరును బియ్యపు కడుగుతో నూరి యిచ్చిన సాలె పురుగు విషం హరించును; పిచ్చికుక్క కరచిన వారికి ఉమ్మెత్త వేరును, వర్ణావాలను నూరి లోనికిచ్చి మనిషిని త్రాళ్ళతో కట్టిన కుక్క వలె కూతలు కూసీ కూసి కొంత సేపటికి విష విముక్తుడౌతాడు. (ఈ చికిత్సను అన్నవరం వద్ద తొండంగి గ్రామమున వెలమలు చేయుచున్నారు.) తెల్ల ఉమ్మెత్త యొక్క ఉత్తర దిక్కు నుండెడి వేరును చితకగొట్టి పాలలోవేసి బెల్లము, నెయ్యి కలిపి పాయసముగా వండియిచ్చిన సమస్త ఉన్మాదము (పిచ్చి)లు తొలగును.

ఉమ్మెత్తాకు, పసుపు కలిపి మెత్తగా నూరి వెచ్చజేసి స్తనములకు కట్టిన వాపులు, చనుకుదురులు, పాలసలపులు, స్తన విద్రధులు శమించును; ఉమ్మెత్త గింజల తైలము నరములకు సత్తువ కల్గించును; లింగమున ఈ తైలము మర్ధనా చేసిన స్థంభనమును కలిగించును; తేలు కుట్టినచోట వేరు అరగదీసి ఆ గంధమును రాసి గుడ్డ పొగ వేసిన విషము హరించును.

---

"ఉన్నత స్థాయిలో వున్నవారు నీతివంతులై వుంటే, నైతికత సమాజంలో అట్టడుగున వున్న వారికి ప్రవహిస్తుంది; ఫలితంగా అందరికీ సౌశీల్యం ఏర్పడుతుంది. శీలాన్ని క్రింద నుంచి పైకి నిర్మించలేము; శీలాన్ని ఎప్పుడూ పైనుండి నిర్మించుకు రావాలి."

- గురూజీ గోళ్వాల్కర్

---

# ఈ ఉదయం స్వరచిత్రం

నా వెనుకనుండి కోటి కోటి సుఖాలు
హిమాలయ దర్పణంలో బింబిస్తూ
దీప తోరణాలై వెలుగుతూ
జ్వాలా కెరటాలై కదలుతూ.

వెనక్కి తిరిగి చూస్తే కిటికీ నుండి
చెట్లు కొండలూ ప్రాణులు మనుషులూ
నేల ఆకాశం సర్వం నిండీ అణువణువూ
ఆవరించిన ఆత్మ రూపం! ఈ ఉదయం.

గత స్మృతుల గూళ్ళలో నుండి
వెలుగు రెక్కలతో పైపైకి
రివ్వున ఎగిరే ఆశతో
ఊగిపోయే విహగ పంక్తుల వలె
సుఖాలు, నాల్గు వైపులా బిందాలు
అన్నీ నా సుఖానికి ప్రతిరూపాలే !

వీటిపై నాకు ఆకర్షణ ; సముద్రమంత !
ప్రణవాన్ని ప్రాణంలో నిల్పుకొని
కాశ్మీర కింజల్క మధు రాగంతో
నేను మాత్రం ఇప్పటి వాడినా ?

సూర్య కిరణాలు ప్రతిఫలించే
శ్రమ బిందువుల సౌందర్యంతో ఈవేళ
కదలుతూన్న ఈ సుఖ సందోహం
నా సుఖ రేఖల అలలతో సరిపోలిందే.

కిటికీ దగ్గర కాసేపు నిల్చున్నా—
చిల్లి పడిన జేబులో నుండి
పోయిన డబ్బుల కోసం ఏడుస్తూ
వెదకుతున్నాడు కుర్రవాడు వీధిలో.

వెలిగి వెలిగి కన్ను మూసిన
దీప స్తంభాన్ని ఆనుకొని నిల్చి
అరుస్తున్నాడు తిడుతున్నాడు పిచ్చివాడు !
విసరిన రాయికి అద్దాలు పగిలిన ధ్వని !

ఆ పై నుండి—మెడకు కట్టుకున్న
ఒడిలో ఊగే పసి మొగ్గతో
నుదుటిపై మీటే ముని వేళ్ళతో
పాట పలుకుతూ వస్తూంది బిచ్చకత్తె !

రాత్రి సిద్ధం చేసిన
హాస్య పటాన్ని చిత్రించడానికి
రాత్రి గడ్డ కట్టిన
శిలా నిశ్శబ్దాన్ని కరిగించడానికి
ఈ సుఖాల్లోని రేఖలు చాలు !
ఈ క్రందనల్లోని స్వరాలు చాలు !

— మాదిరాజు రంగారావు



## " నేనమ్మాయిగారూ ! నరసమ్మని "

తలమీద కొంగు తీసేస్తు మెల్లగా అంది పనిమనిషి నరసమ్మ ।

"నువ్వా ?" చటుక్కున కూలబడింది చందన.

"అవునమ్మా !...మీతో ఓ విషయం చెప్పడాని కొచ్చాను !" అంది నరసమ్మ.

అప్పుడు గుర్తొచ్చింది చందనకి బాబు విషయం..."ఏమిటి? బాబుని నువ్వే తప్పించావా?" ఆమెని కుదిపేస్తూ అంది.

సీరియల్

రావినూతల సువర్ణాకన్నన్

"ఉహూ ! అదికాదమ్మా !" ఒణికి పోయిందామె.

"మరేవిటి ?"

"బాబు సంగతి మాకేం తెలీదమ్మా ! ఆయన లేకపోతే మాక్కూడా అదోలా ఉంది !"

"ఇది చెప్పడానికేనా అర్థరాత్రి లేపావ్ !" చిరాగ్గా అంది చందన.

"అది కాదమ్మా !...."

"చెప్పు !...." అరిచినట్టు అంది చందన.

"బాబు తనంతట తనే వెళ్ళిపోయుంటాడమ్మా !.... ఎవరూ బలవంతంగా తీసికెళ్ళుండరు !" రహస్యం చెప్తున్నట్టు అంది నరసమ్మ.

"నీకెలా తెలుసు ?"

క్షణం మౌనంగా ఉండిపోయింది నరసమ్మ.

"చెప్పు నరసమ్మా !....ఎందుకలా అనుకున్నావ్"

"నా పేరు బైటికి రానివ్వద్దు !....ఇది కేవలం నా అనుమానం మాత్రమే !....మీరు మమ్మల్నందర్నీ అనుమానిస్తుంటే నాకే అనుమానం వచ్చింది !"

"చెప్పు !"

తనకి తోచిన విషయం మెల్లగా చెప్పింది నరసమ్మ.

చందన కొయ్యబారి పోయింది.

"ఇంక నేనెళ్ళనామ్మా !" మెల్లగా అంది నరసమ్మ.

"వెళ్ళు !" అన్నట్టు తలూపింది చందన.

నరసమ్మ గుమ్మంకేసి నడిచింది.

"నరసమ్మా !" హటాత్తుగా పిలిచింది చందన.

"ఏవిటమ్మా ?" ఆమె వెనక్కి తిరిగింది.

"నేను వాళ్ళ సంగతి చూస్తాను గానీ....ఈ సంగతి ఎవరికీ చెప్పకు !"

"అలాగేనమ్మా !"

"ఇంక వెళ్ళు !"

నరసమ్మ తలుపు దగ్గరగా లాగి వెళ్ళిపోయింది. ఇంక చందనకి నిద్ర పట్టలేదు. భయంకరమైన అనుమానాలు, ఆలోచనలు ఆమెని కందిరీగల్లా ముసిరేశాయి.

భళ్ళున తెల్లవారింది.

మర్నాడు ఉసూరుమంటూ వెళ్ళిపోయాడు జయంత్.

వెళ్ళేటప్పుడు శాంతారామ్, దేవకి అతనికెన్నో విధాల ధైర్యం చెప్పారు. చందన సరేసరి.

బాబుని గురించిన బెంగ ఆమెని మరీ కృంగ దీసింది. ఆమె పరిస్థితి చూసి జాలి కూడా వేసింది జయంత్‌కి.

"వస్తాను ! నేనూ వెతుకుతాను ! మీరూ వెతకండి! నాకొకటే ధైర్యం !. వాడి ఒంటిమీద నగలేం లేవు ! ఎవరో అల్లరికి తీసికెళ్ళుంటారు గానీ....వాడికున్న లక్షల ఆస్థి కోసం మాత్రం కాదు !" అదోలా అన్నాడు.

"నిజమే ! మీరన్నట్టు డబ్బుకోసం కాదు !....అలా అయితే ఈ పాటికి దాని గురించి ఉత్తరాలో ఫోన్ కాల్సో వచ్చేవి !.....పోనీ లక్షలాస్థికి వారసుడూ కాదంటున్నారు కాబట్టి దాయాదుల బాధా అయుండదు.

సరదాకే చేశారో, మరే ప్రయోజనాన్ని ఆశించే చేశారో మెల్లగా తెలియాలి !" అంది చందన.

"అవును !....వాడికి ప్రాణభయం మాత్రం ఉండదు! కాకపోతే పిల్లాడు కాస్త బెంగ పడతాడు !" దేవకి అంది.

అందరి దగ్గరా మరోసారి శలపు తీసుకుని పోయాడు జయంత్.

**జరిగిన కథ**

మురళితో చందన పెళ్ళి ఆగిపోతుంది.

చందనని "అమ్మా" అంటూ ఆ ఇంట చేరిన బాబు చేతిలోని ఫొటో చూసి నిర్ఘాంత పోతారు చందన, ఆమె మేనమామ రాఘవ.

బాబు ఇంట్లో అందరికీ చేరువౌతాడు. చందన అంగీకారంతో తను, మురళి శ్రీనగర్ వెళ్ళి కొన్ని సంగతులు తెలుసు కోవాలను కుంటాడు రాఘవ.

పేపర్లో బాబుని గురించిన ప్రకటన చూసి అందులోని అడ్రస్‌కి ఫోన్ చేస్తుంది చందన. ఆమె చెప్పినట్టే బాబు తండ్రి జయంత్ శాంతారామ్ ఆఫీసు కొస్తాడు. అన్ని సంగతులు వివరించి అతన్ని ఇంటికి తీసుకొస్తుంది చందన. అయితే బాబు ఇంట్లోంచి మాయమౌతాడు. జయంత్ వాళ్ళని నిందిస్తాడు. ఇంట్లో వాళ్ళంతా అతనికి నచ్చ జెప్పి రెండు రోజులు అక్కడే వుండమని కోరతారు.

ఇంట్లో వాళ్ళ సహాయం లేందే బాబు ఎక్కడికీ వెళ్ళలేడనుకున్న చందన నౌకర్లందర్నీ పిల్చి బెదిరిస్తుంది. అయినా ఫలితం శూన్యం ! అర్ధరాత్రి తన గదిలో ఓ ముసుగు మనిషిని చూస్తుంది చందన.

(ఇంక చదవండి)

విషయం విని మురళి పరిగెత్తు కొచ్చాడు. అతన్ని చూసి చందన మొహం చిట్లించింది.

"చందనా ! నామీద కోపం పోలేదు కదూ ?" దీనంగా అన్నాడు మురళి.

"నీ మీద కోపమా ? ఎందుకు ?"

"అలా మాట్లాడితే ఏం చెప్పగలను ?....క్షణం కూర్చోవచ్చా ?"

"కూర్చోండి !" ముభావంగా అంది చందన.

"బాబునెవరో ఎత్తుకు పోయారటగా ?"

"అనే అనుకుంటున్నాం !"

## నిరుద్యోగులు

భారతదేశంలో నిరుద్యోగుల సంఖ్య నానాటికి పెరిగిపోతున్నది. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌లలో తమ పేరును నమోదు చేసుకొని ఆశతో ఎదురుచూస్తూ, నిరాశకు లోనౌతున్న వారి సంఖ్య సంవత్సర సంవత్సరానికి పెరుగుతున్నది. ఎంప్లాయిమెంట్ ఎక్స్ఛేంజ్‌లలో నమోదు చేసుకున్నవారి వివరాలు.
చేయించుకోని వారెందరో? చెప్పడం కష్టం.

| | | | |
|---|---|---|---|
| 1961 సం॥ ఆఖరుకు | 32 లక్షల | 30 వేలు |
| 1971 సం॥ | ,, 51 | ,, 30 ,, |
| 1978 సం॥ | 61 | ,, 43 ,, |
| 1981 సం॥ | 178 | ,, |
| 1984 సం॥ | 235 | ,, |

ప్రతి సంవత్సరం షుమారు 50 లక్షల మంది నిరుద్యోగులు పెరుగుతున్నారని క్రీ. శ 2000 సం॥ నాటికి మన దేశంలో నిరుద్యోగుల సంఖ్య 12 కోట్లకు పెరుగుతుందని నిపుణుల అంచనా.

* 1981, 1984 లెఖ్ఖలు ఈమధ్యనే శ్రామికశాఖ మాత్యులు లోక్‌సభలో తెలియజేసారు.

"నాన్నగారి ఆరోగ్యం...."

"బ్రహ్మాండంగా ఉంది!" అందుకుని కఠినంగా అంది చందన.

"చందనా! నీ బాధ నేను అర్థం చేసుకోగలను! ఏదో గ్రహణం పట్టి, దంపతులం కావాల్సిన మనల్ని శత్రువులుగా చేసింది!" బాధగా అన్నాడు మురళి.

మొహం గంటు పెట్టుకుని మౌనంగా కూర్చుంది చందన. ఆమెకి మురళి రాక ఆనందానివ్వలేదు సరికదా చిరాకును కూడా కలిగించింది.

"నా మొహం నీకు చూపించాలంటేనే చచ్చే సిగ్గుగా ఉంది....కానీ తప్పని సరై వచ్చాను!" అన్నాడు మురళి.

"ఏమిటా తప్పనిసరి?"

"నీకో శుభవార్త చెప్పాలని!"

"శుభవార్తా?...." కళ్ళు చిట్లించింది చందన.

"అవును....బాబుని గురించి."

"బాబుని గురించా!" గభాల్న లేచింది చందన.

"అవును?"

"ఏమిటి బాబు నీకు కనిపించాడా? ఎక్కడ?" ఆతృతగా అడిగింది చందన.

మురళి మౌనంగా చేబులోంచి ఓ లెటర్ తీసి ఆమె కందించాడు.

అందులో ఇలా వుంది.

"మురళీ! నీ పెళ్ళి తప్పిపోయినా నీకు చందన మీద ఆశమాత్రం చావలేదు! పాపం! నాకు జాలిగా ఉంది!... నీ పెళ్ళి ఆగిపోవడానికి కారకుడైన బాబు ప్రస్తుతం నా దగ్గరున్నాడు. వాణ్ణి ఈ రోజే కాశ్మీర్ తీసికెళ్ళిపోతున్నాను.

వాడు దొరికితే గానీ....నీ పెళ్ళికి ఒప్పుకోడు మీ నాన్న!.... అందుకే రెండు లక్షల రూపాయలు తీసుకుని వెంటనే శ్రీనగర్ రా!....మిగతాది నేను చూసుకుంటాను?....

అతి తెలివికి పోయి పిచ్చి వేషాలు వేశావో....బూడిదై పోతావ్ జాగ్రత్త?

ఇట్లు
భస్మాసురుడు"

"ఎవడీ భస్మాసురుడు ?" తడారిన గొంతుతో అంది చందన.

అప్పుడే రాఘవ వచ్చి ఉత్తరం చూశాడు. అతని కళ్ళు కోపంతో ఎర్రపడ్డాయి.

"రాస్కెల్ !.... వీణ్ణి అంత తేలిగ్గా వదల కూడదు!" పళ్ళు పటపట కొరికాడు.

కవర్ మీద పోస్టల్ ముద్రలు చూశాడు. అవి లోకల్ ముద్రలే.

"ఏం చేద్దాం మావయ్యా " బేలగా అంది చందన.

" వెంటనే శ్రీనగర్ వెళ్దాం ! " ఆవేశంగా అన్నా

" డబ్బు తీసుకునా ? "

" నో ! డబ్బు ఇవ్వడానిక్కాదు వాడి అంతు తేల్చ డానికి " కోపంతో అతని గొంతు ఒణికింది.

" అయినా ఉత్తరం మనకో, అతని తండ్రికో రాయక అతని కెందుకు రాశాడు మావయ్యా ? " అయోమయంగా అంది చందన.

" అదీ తేలుస్తాను ! మాతోపాటు నువ్వూ వస్తావా ? " ఏదో ఆలోచిస్తూ అన్నాడు రాఘవ.

" వస్తాను. కానీ. డబ్బు లేకపోతే బాబుకి ఏదైనా అపకారం తలపెడతారేమో ! " భయంగా అంది చందన.

ఆలోచనలో పడ్డాడు రాఘవ.

" డబ్బు నేను తెస్తాను ! " అన్నాడు మురళి.

" నువ్వా ? " అదోలా అంది చందన.

" అవును !— నేనే !- నేను చేసిందానికి ప్రాయశ్చిత్తం చేసుకోందే నాకు నిద్ర పట్టేలా లేదు ! "

చందన మాట్లాడలేదు.

" ప్లీజ్ చందనా, నాకీ ఒక్క అవకాశం ఇవ్వు " ప్రాధేయపూర్వకంగా అన్నాడు మురళి. క్షణం ఆలోచనలో పడ్డ చందన తేరుకుని-

" సరే ", అన్నట్టు తల పంకించింది.



" థాంక్యూ ! " సంతోషంగా అన్నాడు మురళి.

చందన మాట్లాడకుండానే లేచింది.

" బావకి చెప్పద్దూ ? " అనుమానంగా అన్నాడు రాఘవ.

" వెంటనే ఒప్పుకోక పోవచ్చు. మెల్లగా నచ్చ చెప్పాలి " అంది చందన ఏదో ఆలోచిస్తూ.

" ఇంతకీ వాళ్ళని ఎక్కడ కలుసుకోవాలో ? " హటాత్తుగా అన్నాడు రాఘవ.

" వాళ్ళు మనల్ని గమనిస్తూనే ఉంటారు ! కాశ్మీర్లో అడుగు పెట్టగానే మనల్ని కలుస్తారు !- " విరక్తిగా అంది చందన.

" నిజమే !-కాస్త గమనించి చూడాలి " అన్నాడు మురళి.

* * *

అనుకున్న విధంగా మురళి, రాఘవ, చందన, శ్రీనగర్ బయల్దేరారు. ముందు శాంతారామ్ ఒప్పుకో




లేదు చందన వెళ్ళడానికి. రాఘవ, చందన అనేక విధాల బతిమాలే సరికి చివరికి అయిష్టంగానే ఒప్పుకున్నాడు. దేవకి వంద జాగ్రత్తలు చెప్పిమరీ పంపింది.

" ఇదో అక్కా నీ కూతుర్ని మళ్ళీ పువ్వుల్లో పెట్టి అప్పచెప్పినట్టు అప్పచెప్తాను. " నవ్వుతూనే అన్నాడు రాఘవ.

చందనా వాళ్ళు శ్రీనగర్లో అడుగు పెట్టింది మొదలూ తమనెవరైనా గమనిస్తున్నారేమో అని వెయ్యి కళ్ళతో చూస్తున్నారు. అయితే వాళ్ళు ఊహించినట్టు ఎవరూ రానూ లేదు, తమని పలకరించనూ లేదు.

ముగ్గురూ ఓ గెస్ట్‌హౌస్‌కి చేరుకున్నారు.

మంచం దగ్గరి సోఫాలో కూర్చుంటూ-

" ఇప్పుడేం చేద్దాం మావయ్యా ? " విసుగ్గా అంది చందన.

" చూద్దాం; . . మనకి తెలియకుండా ఎవరైనా మనల్ని గమనించారేమో ! అలా అయితే మరి కాస్సేపట్లో రావచ్చు ! " అన్నాడు రాఘవ.

" అతను రాకపోతే ?" ఏదో ఆలోచిస్తూ అన్నాడు మురళి. రాఘవ మాట్లాడలేదు.

" ఒకవేళ ఎవరైనా సరదాకి రాశారేమో !" అనుమానంగా అంది చందన.

" చూద్దాం ! " ముభావంగా అన్నాడు రాఘవ. ముగ్గురూ కాఫీ టిఫిన్స్ తీసుకున్నారు.

" మావయ్యా ! - ఎక్కడికైనా వెళ్దామా ? ఈ ఏరియా అంతా నాకు తెలుసు ! ఇక్కడ నాకు తెలిసిన వాళ్ళు కూడా వున్నారు. " ఓరగా మురళి కేసి చూస్తూ అంది చందన.

"లోగడ మీరున్నది. ఈ ఏరియాలోనేనా ?" యాధాలాపంగా అడిగినట్టు అడిగాడు మురళి.

"అవును" అంది చందన ముభావంగా. ఆమెకి తెలుసు మురళి అలా ఎందుకడిగాడో—

తను ఇక్కడ ఎందుకుంది ? .... ఎవరో అన్నట్టు అక్రమసంతానాన్ని కనడానికా, లేక నిజంగానే సుస్తీ చేసిందా.... అని ! డైరెక్టుగా అడగలేక ఇల్లా మెల్లగా రాబట్టాలని చూస్తున్నాడు ! పూర్ ఫెలో! అతని అమాయకత్వానికి జాలిగా నవ్వుకుంది.

" ఇంతకీ.... ఇప్పుడు సైటుకెళ్దామా, వద్దా ? " రాఘవ కేసి చూస్తూ అంది.

" తీరా మనం వెళ్ళాక వాళ్ళొస్తే ?"

" నిజమే " అన్నాడు మురళి.

ముగ్గురూ ఏవో మాట్లాడుకుంటూ కూర్చున్నారు.

గంట! రెండు గంటలు! మూడు గంటలు గడిచి పోయాయి. కానీ ఎవరూ రాలేదు.

" వాళ్ళు మనల్ని చూసి వుండరు " అంది చందన

"పోనీ. కాస్సేపలా తిరిగొద్దాం రాఘవా ! రిసెప్షన్‌లో చెప్పి వెళ్దాం !" అన్నాడు మురళి కూడా విసుగ్గా.

"సరే ! పదండి !" అన్నాడు రాఘవ.

ముగ్గురూ బైటికొచ్చి రిసెప్షన్‌లో చెప్పి బైటికెళ్ళి పోయారు. మధ్య మధ్య భస్మాసురుడి కోసం ఓ కన్ను వేస్తున్నారు. అయితే ఎవరూ వార్ని కుతూహలంగా గమనించడం లేదు.

"ఇది కచ్చితంగా ఎవరో ఏడిపించడానికి రాసిన ఉత్తరమే !" అంది చందన.

"అలాంటప్పుడు శ్రీనగరే అని ఎందుకు రాస్తారు?.... బాబు విషయం ఎంత మందికి తెలుసు !" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రాఘవ.

"మరయితే....ఇంకా రారేం ?"

"వస్తారు ! వాళ్ళేం ఆలోచిస్తున్నారో !"

"ఒక వేళ మనం డబ్బు తేలేదని అనుకుంటున్నారేమో !" అన్నాడు మురళి.

"ఆ సంగతి తెలుసుకోవడానికైనా రావాలిగా !" అంది చందన.

"నిజమే !" అన్నట్టు తల ఊపాడు మురళి.

"ఎన్నాళ్ళిలా వుందాం మావయ్యా ?" విసుగ్గా అంది చందన.

"ఏవిఁటి అప్పుడే బోరుకొట్టిందా ?" నవ్వుతూ అన్నాడు రాఘవ.

చందన మాట్లాడలేదు.

ఆ తరవాత తెలిసిన వాళ్ళందరిళ్ళకీ తీసుకెళ్ళింది రాఘవని, మురళిని. అందరూ ఆప్యాయంగా పలకరించారు. ఆరోగ్యాన్ని గురించి పరామర్శించారు. తల్లిదండ్రుల గురించి అడిగారు.

అంతా వింటూనే ఉన్నారు మగాళ్ళిద్దరూ.

"చాలా ఇంకా నా గురించిన వివరాలు కావాలా ? కావాలంటే వీళ్ళ నడిగి తెలుసుకోవచ్చు !" అన్నట్టు చూసింది చందన.

మురళి సిగ్గుగా తల దించుకున్నాడు. రాఘవ మురళికేసి కోరగా, చందనకేసి ఆప్యాయంగా చూశాడు.

* * * *

కాలం గడిచి పోతోంది గానీ వారు ఎదురు చూసిన వ్యక్తులు డబ్బు కోసం రాలేదు. అందరికీ విసుగ్గా ఉంది.

"మావయ్యా ! ఇవాళ బోట్ షైర్ వెళ్దామా ?" అంది చందన.

"అలాగే !...." అన్నాడు రాఘవ.

## తల్లి పాలు - డబ్బా పాలు

పాఠశాలలో ఉపాధ్యాయులు సమర్థవంతమైన బోధనా శక్తి, శ్రద్ధ, పట్టుదల కలిగివుండి, ఉన్నత విద్యా ప్రమాణాలుగల విద్యార్థులను తయారుచేసిననాడు - ప్రైవేటు ట్యూషన్లు, గైడ్సు యొక్క అవశ్యకత ఏమాత్రం వుండదు.

పాఠ్యపుస్తకము "తల్లి పాలు" అయితే; గైడు "డబ్బా పాలు". తల్లి ఏవిధంగా తన పిల్లలను తీర్చిదిద్దడానికి ఎంత శ్రమిస్తుందో, అదే విధంగా పాఠశాలలలోని ఉపాధ్యాయులు బాల బాలికలను సక్రమ మార్గాన పెట్టడానికి శ్రమించగలిగిననాడు, పిల్లలు పాఠశాలలలోని ఉపాధ్యాయులను తల్లులుగా, ప్రైవేటు మాష్టరను సవతి తల్లులుగా భావిస్తారు.

తల్లి పాలు త్రాగి పెరిగిన పిల్లలకు డబ్బా పాలు త్రాగి పెరిగిన పిల్లలకు ఎంతటి తేడా వుంటుందో; పాఠ్యపుస్తకములు క్షుణ్ణంగా చదివిన విద్యార్థులకు గైడ్స్ చదివిన విద్యార్థులకు అంత తేడా వుంటుంది.

---

తెచ్చి పెట్టుకున్న ఉత్సాహంతో అందరూ బయల్దేరారు. మురళికి ఓసారి చందనని ట్రీట్ చేసిన డాక్టర్ని కూడా కలవాలని వుంది ! కానీ ఆ మాట ఆమెతో అనడానికే సాహసం లేదు.

ముగ్గురూ బోట్‌లో కొంత దూరం వెళ్ళారు.

"నా గురించి ఇంకా ఏవైనా తెలుసు కోవాలని ఉందా?" ఓరగా చూస్తూ అంది చందన.

"సారీ చందనా !" సిగ్గుగా అన్నాడు మురళి.

"పరవాలేదు !....నన్ను ట్రీట్ చేసిన డాక్టర్ దగ్గరి క్కూడా వెళ్దాం !...ఆవిడకి నేనంటే చాలా అభిమానం!... మీ అనుమాన నివృత్తి అవుతుంది, నాకావిడ్ని చూసినట్టూ ఉంటుంది !" అతని భావాల్ని చదివినట్టు అంది చందన.




"చచ్చిన పాముని ఇంకా చంపడం న్యాయం కాదు చందనా !" దీనంగా అన్నాడు మురళి.

కసిగా నవ్వింది చందన.

మళ్ళీ భారంగా అంతా ఒడ్డు చేరుకున్నారు. రెస్టారెంట్‌లో కూర్చుని టిఫిన్ తింటున్నారు.

"హాయ్ చందనా !"

గంభీరమైన ఆ స్వరానికి తృళ్ళిపడి చూసింది చందన.

ఆ పలకరించింది చందనని ట్రీట్ చేసిన డాక్టరే !

"ఓ ! డాక్టర్ ! మీరా ! ఇక్కడ !" గభాల్న లేచి సంతోషంగా ఆవిడ చెయ్యి పట్టుకుంది.

"బావున్నావా ?" ఆప్యాయంగా అందావిడ.

"మీ దయవల్ల !....కానీ డాక్టర్ ! ఇప్పుడే మీ గురించి మావాళ్ళకి చెప్తున్నాను !....లక్కీగా మీరు కనిపించారు !"

ఆవిడ తియ్యగా నవ్వింది.

"బావుంది ! ఈ వూరెప్పుడొచ్చారు ? అమ్మా నాన్నా బావున్నారా ?" అంది.

"ఆ !...." అంటూ రాఘవనీ, మురళినీ పరిచయం చేసింది చందన.

కొంతసేపు సరదాగా కబుర్లు చెప్పుకున్నారు కూర్చుని.

"చూడు !....ఏదైనా అనుమానం ఉంటే అడిగి తెలుసుకో ?" అన్నట్టు చూసింది చందన.

" అన్నట్టు చందనా ! నీ ఆరోగ్యం ఎలా ఉంది ?" హఠాత్తుగా అడిగింది డాక్టర్.

" బానే ఉంది డాక్టర్ .... " నవ్వింది చందన.

" బాబు బావున్నాడా ? "

" బాబా ? " తృళ్ళి పడింది చందన.

" అదేనమ్మా ! నీ కొడుకు.... ఆరేళ్ళు లేవూ ?.... అబ్బ .... ఆ రోజు ఎంత కంగారు పెట్టాడు " ఆ రోజులు గుర్తు తెచ్చుకుంటున్నట్టు అంది డాక్టర్.

" డాక్టర్.... " కంగారుగా అంది చందన.

" ఓ సారీ వీళ్ళకి తెలియదా ? .... అయినా ఇందులో దాచడానికేం వుంది ? " .... అయోమయంగా అందావిడ.

" సారీ డాక్టర్ .... మీరెవరి గురించి మాట్లాడుతున్నారో .... మా చందన అవివాహిత " గొణిగినట్టు అన్నాడు రాఘవ.

" వ్వాట్ ? " అదిరి పడింది డాక్టర్.

" అవును .... డాక్టర్ ! "

" సారీ ! ఆ సంగతి నాకు చెప్పలేదు ఆమె పేరెంట్స్. భర్త ఫారిన్‌లో ఉన్నాడనీ, ఆరోగ్యం అంత బాగా లేనందున గాలి మార్పు కోసం ఇక్కడికి తీసుకొచ్చామనీ అన్నారు.... రియల్లీ అయామ్ వెరీసారీ ! " అంటూ దూరం నించి భర్త పిలవడంతో పరుగులాంటినడకతో వెళ్ళిపోయిందావిడ.

చందన కళ్ళు గిర్రున తిరిగాయి. కాళ్ళ కింద భూమి కదులుతున్నట్టు అనిపించింది. అంతే ! స్పృహ తప్పి కుప్పకూలి పోయింది.

" చందనా ! .... "

రాఘవ పిలుపుతో భారంగా కళ్ళు తెరిచింది చందన. క్షణం అయోమయంగా అనిపించినా వెంటనే జరిగింది గుర్తొచ్చి మొహం పాలిపోయింది.

" చందనా ! " మృదువుగా పిల్చాడు రాఘవ.

"మావయ్యాక్షి ! మురళి .... "

" నైటున్నాడు ! పిలవనా ? "

" ఉహూఁ ఒద్దు ! " కంగారుగా అంది చందన.

ఆమె కళ్ళ నిండా నీళ్ళూరి చెంపల మీదుగా దిండు మీదికి జారిపోతున్నాయి.

" ఛ ఛ ! ఏడుస్తున్నావా ....ఇలాంటప్పుడే చందనా, మనసుని నిబ్బరంగా ఉంచుకోవాలి "

"కానీ....మావయ్యా ? ఆ డాక్టర్ చెప్పింది అబద్ధం!

"కావచ్చు !"

"మరి....మరెందుకలా చెప్పింది ?"

"చూద్దాం ! నువ్వింక ఇవేం ఆలోచించకుండా హాయిగా పడుకో !"

"నో ! ఇప్పుడే వెళ్ళి సంగతి తేలుస్తాను !" ఆవేశంగా లేవబోయింది చందన.

"ఎక్కడికి ?" చటుక్కున ఆమె నాపుతూ అన్నాడు రాఘవ.

"ఆ డాక్టర్ దగ్గరికి !"

"ఎందుకు ?...."

"ఎందుకు అబద్ధం ఆడిందో అడుగుతాను !"

"అనవసరం చందనా !" భారంగా నిట్టూర్చాడతను.

"ఏం ?"

"నేను....వెళ్ళాను!"

"ఎక్కడికి ?"

"అదే ఆ డాక్టర్ దగ్గరికి !"

"ఏవిటీ ?" గభాల్న లేచి కూర్చుంది చందన.

"అవును చందనా !.... నువ్వలా స్పృహ కోల్పోతే సహించలేక పోయాను. ఎలాగో ఆవిడ ఇల్లు కనుక్కొని వెళ్ళాను."

# నిరుపేదలం

చేతికంది నోటికందదు భోజనం
చేతులుండి లేనట్టు – చైతన్యముండి లేనట్టు
కరువు డొక్కల్లో ఆకలుండి లేనట్టు
ఆశలుండి లేనట్టు – శ్వాసలుండి లేనట్టు
కనులుండి చూడనట్టు – కన్నీరు కార్చిచ్చు
ఇదిఓడిపోయి బ్రతకలేక బ్రతుకుతున్న శిల్పం
పచ్చని బ్రతుకును పేదరికం తినివేస్తున్న
శృంగభంగం.

సలీందురాని

"ఏమంది ? ఎందుకంత అబద్ధం ఆడిందట?" గబగబా అంది చందన.

"ఇప్పుడా విషయాలన్నీ ఎందుకు చందనా !" గంభీరంగా అన్నాడు రాఘవ.

"నో ! నాకు చెప్పాలి ! ఆవిడ ఏమంది ?"

"నీకు కొడుకు పుట్టడం అబద్ధం కాదంది ! అంత అబద్ధం ఆడాల్సిన అవసరం తనకి లేదంటూ మండి పడింది. పాత రిజిష్టర్లు తెచ్చి నాముహాన పడేసింది !"

"వాటిలో....ఏం వుంది ?" పాలి పోతున్న ముఖంతో అంది చందన ఆమెకి మళ్ళీ స్పృహ పోయేలా వుంది.

"నీకు నెలలు నిండగానే కొడుకు పుట్టాడనీ, భర్త పేరు వినోద్ అనీ స్టేట్స్‌లో ఉన్నాడనీ, మతి చాంచల్యం నీకు పెళ్ళికి ముందే వుందనీ, కన్నప్పుడు కూడా నీకు మతి లేదనీ, ఇంకా చాలా ఉన్నాయి !" బాధగా అన్నాడు రాఘవ.

(సశేషం)

# బాబూ రాజే ప్రసాద్

బాలలూ ! భారతదేశపు తొలి రాష్ట్రపతి డాక్టర్ బాబూ రాజేంద్ర ప్రసాద్ అని మీకందరకు తెలిసే ఉండాలి ! _ రాష్ట్రపతి వంటి ఉన్నత స్థానాన్ని అలంకరించిన రాజేంద్ర ప్రసాదు బాల్యం ఎలా గడిచిందో తెలుసుకుందాం !

బాల
సోమంచిరామం

రాజేంద్ర ప్రసాదు ఉత్తర ప్రదేశ్‌కు చెందిన కాయస్థ కుటుంబానికి చెందినవారు. ఆయన తండ్రి పేరు మహదేవ సహాయ్ ! ఆయన జన్మించిన తేది 3_12_1884. ఆయనకు ఒక అన్నగారు; ముగ్గురు అక్కలు ఉండేవారు. రాజేంద్ర ప్రసాదు అందరికన్న చిన్నవాడు. చిన్నప్పటి నుంచీ పల్లెటూరిలోనే ఉండడం చేత అక్కడి ఆటలైన, కబాడీ, కొక్కో_ ఆడుతూండేవాడు. కోతి కొమ్మచ్చి ఆట కూడ ఉన్నా రాజేంద్ర ప్రసాదు ఎందుచేతనో దాని జోలికి పోయేవాడు కాదు. చిన్నప్పటి నుంచే ఆయన చేసికొన్న ఒక ముఖ్యమైన అలవాటు; సాయంత్రం అలసట వచ్చే దాక ఆటలు ఆడడం,_చీకటి పడగానే త్వరగా నిద్ర పోవడం_ తెల్లవారు ఝామునే నిద్ర లేవడం !_ ఇది యెంతో మంచి అలవాటు_ ఆరోగ్యాన్ని కాపాడే పద్ధతి. ఈ అలవాటు మనందరం కూడ చేసికోవటం మంచిది.

రాజేంద్ర ప్రసాదుకు అయిదోఏటో ఆరవఏటో అక్షరాభ్యాసం చేశారు.

ఇంటికి దగ్గరలోనే ఉన్న బడికి ప్రాతః కాలమునే వెళ్ళేవాడు. ఆయన గురువు మౌలవీ సాహెబ్ గారు ముందుగా క్రితం రోజు యిచ్చిన పాఠాన్ని వప్పగించు కొనేవారు. ఎవరు ముందు వప్పగిస్తే వారికి ముందుగా కొత్త పాఠం చెప్పేవారు !. అందరికన్న ముందుగా బడికి వెళ్ళి, పాత పాఠం వప్పచెప్పి_కొత్త పాఠం చెప్పించు కునేవాడు రాజేంద్ర ప్రసాదు !_అంత చిన్న వయసులోనే చదువుపై అంత శ్రద్ధ_పట్టుదల కనపర్చే వాడు కనకనే జీవితంలో అంత పైకి వచ్చాడు !_

రాజేంద్ర ప్రసాదు ఊళ్ళో చిన్న చిన్న మఠములు ఉండేవి !_ అందులో ఉండే సాధువులు భక్తిగీతాలు, భజనలు చేసేవారు. శ్రీరామ నవమికి కృష్ణాష్టమికి మఠాల్లో ఉత్సవాలు జరిగేవి. రాజేంద్ర ప్రసాదు అన్నింట్లోనూ పాల్గొనే వాడు !_అప్పటి నుంచే ఆయనకు రామాయణ పఠనం పై ఆసక్తి కలిగింది. క్రమం తప్ప కుండ రామాయణ, భారతాలు చదివేవాడు. మానవుని జీవితం సన్మార్గంలో సాగాలంటే_ఎలా ఉండాలో తెలియ చెప్పే మహా గ్రంథాలు అవి. చిన్నప్పటి నుంచీ వాటిని చదివిన వాళ్ళు, తమ జీవితానికి ఒక లక్ష్యాన్ని, ఆశయాన్ని ఏర్పరచుకో గలుగుతారు ! ఎన్ని సంవత్సరాలు గడచినా, ప్రజలందరికీ ఉత్తేజాన్ని, ఉపదేశాల్ని అందించే గ్రంథాలు అవే !

ఆ రోజుల్లో కొన్ని గ్రామాల్లో సురాపానము, అంటే కల్లు తాగడం, మద్యపానము_ఉండేది కాని రాజేంద్ర ప్రసాదు వంశస్థులు సురాపానాన్ని పాపకార్యంగా భావించే వారు. మద్యపానం చేస్తే కుష్టురోగి అవుతాడని పెద్దలు నమ్మి, దానికి దూరంగా ఉండేవారు ! పెద్దల్ని పిల్లలు ఎప్పుడూ అనుకరిస్తారు కాబట్టి, పిల్లల కూడ మద్య

## ప్రార్థన

జయ జయ జయ వాణీ !
జయము నీయవె వీణాపాణీ !! ॥జయ॥

అంజలు లిడె గొనుమా, మ
మ్మందరి దయ గనుమా !
బాలలమమ్మా చదువుల తల్లీ
ప్రార్థన చేతుము కావగదమ్మా!! ॥జయ॥

స్వార్థము మాలో పోగొట్టి
సఖ్యత మాకు చేకూర్చి !
విద్యల నొసగి వినయము కూర్చి
విజ్ఞానము మాకీయమ్మా !! ॥జయ॥

- రవుల ఆంజనేయశర్మ

పానం అంటే మహాపాపం అనే భావంకల్గింది. ఈ విషయాన్ని ఇప్పటి పెద్దలుకూడ గుర్తించడం ఎంతోమంచిది.

ఆ రోజుల్లో బళ్ళల్లో ఎనిమిదో తరగతి చిన్న తరగతి. ఒకటో తరగతి పెద్ద తరగతి. రాజేంద్ర ప్రసాదు అక్షరాభ్యాసం అయిన దగ్గర నుంచీ చదువుపై శ్రద్ధ వహించడంతో ఒకసారి హెడ్మాష్టారు ఆయనకు డబుల్ ప్రమోషను యిచ్చేశారు. అంటే ఎనిమిదిలోంచి ఏడవ తరగతికి బదులు ఏకంగా ఆరో తరగతిలోకే పంపించేశారు.

చదువులో అంత శ్రద్ధ కలగడానికి కారణము ఆయనకు పేరే ప్రైవేటు మేష్టారు లేక పోవడమేనంటారాయన !ప్రైవేటు మేష్టారు లేరు కాబట్టీ బళ్ళో చేప్పే విషయాల్ని, పాఠాల్ని శ్రద్ధగా, చక్కగా విని యింట దగ్గరే చదువుకునే వాడ్నని చెప్తారాయన-ఇదెంత మంచి పద్ధతో మీరంతా ఒక్కసారి ఆలోచించండి !

ఈ విధంగా చిన్నతనంలోనే శ్రద్ధ, పట్టుదల, క్రమమైన పద్ధతిలో విద్యార్జన చేసి, యావద్భారత దేశానికే ప్రథమ పౌరుడు- రాష్ట్రపతి అయిన రాజేంద్ర ప్రసాదులా మీరంతా కృషి చేస్తారు కదూ ! 

## పంచభూతాలు నవ్వాయి ?

అతను కృంగి పోయాడు ఉద్యోగం పోయిందని
ఆమె ఏడుస్తున్నది సంసార మెలా సాగుతుందని
వారి కొడుకు వాపోతున్నాడు ఉద్యోగం రాలేదని
వారి అమ్మాయి అనుకుంటున్నది ఇహ తనకు
పెళ్ళి కాదని

మిగతా పిల్లలు మారం చేస్తున్నారు
ఆకలి తీరటం లేదని
చాలీ చాలని పెన్షనుతో
సంసారపు ఖర్చులు భరించలేక
పిచ్చివాడయి బస్సు క్రిందపడి, నలిగి నశించాడతను
అతని రక్తం మేదినికేమి చెప్పిందో ?

ఆ దుస్సంఘటన సహించలేక, జీవించలేక
ఉరోసుకు చచ్చిందతని భార్య
ఆమె గాలి కే కబురు చెప్పిందో మరి ?

పెళ్ళి కాని కూతురు, ఓ కామాంధుడు కొంగు
లాగాడని
అవమానం భరించలేక, అగ్నికి ఆహుతయ్యింది
అగ్నికామె విన్నప మేమిట్లో ?

అన్నా అని తనను చుట్టుకున్న చిన్నారుల
ఆకలి ఎలా తీర్చాలో తోచని చీకటిలో
గోదారిని శరణు జొచ్చాడా నూనూగు మీసాల
కుర్రాడు
అతనా పవిత్ర గంగకు ఏమి చెప్పి ఏడ్చాడో ?

పంచ భూతాలూ పక్కున నవ్వాయట
ఆ ప్రజాస్వామ్య రాజ్యాన్ని చూసి !

కావిలిపాటి విజయలక్ష్మి



# కవిత - నేత

కవితలు అల్లేడంటారు–బట్టలు నేసేడంటారు–చిక్కని పద బంధాలతో అల్లిన కవిత్వం చక్కగా వుంటుంది. అందుకే "అల్లసానివాని అల్లిక జిగిబిగి" అన్నారు. అలాగే చిక్కగా పడుగు పేకలతో నేసిన నేత కూడాచక్కగా వుంటుంది. బట్టల నేతలో ప్రసిద్ధిగాంచినఒక సాలెవాడు–కవిత్వం నేతలో కూడా తాను సమర్థుడే అన్న విషయాన్ని ఎంతో చమత్కారంగా చెప్పి భోజమహారాజుచే మెప్పు పొందిన సంగతి చూడండి—

అది భోజమహారాజు రాజ్యం చేస్తున్న కాలం. తరువాతి ప్రభువు లెవరైనా కవి పండిత పోషకులై స్వయంగా విద్వాంసులై సారస్వత సేవ చేస్తే వారిని 'ఆంధ్ర భోజులుగా,' 'అభినవ భోజులు' గా కీర్తించేం. అటువంటిది సాక్షాత్తూ భోజుడే పరిపాలిస్తున్న రోజులవి. ఓనాడు భోజుని సభలోకి లక్ష్మీధర పండితుడను ద్రవిడ దేశస్థుడు వచ్చి – రాజును ప్రశంసించి–తన విద్వత్తుతో ఆనందింప జేసేడు. ప్రభువు అక్షర లక్షలతో అతని నాదరించేక – సకుటుంబంగా వచ్చిన ఆ పండితునికి నివాసం ఏర్పాటు చేయమన్నాడు. రాజాజ్ఞగా – మంత్రి ఊరంతా వెతికినా ఒక్క ఇల్లు ఖాళీ లేదు. చివరికి మూర్ఖు లెవరైనా వుంటే వాళ్ళని పొమ్మని ఆ యిల్లు పండితుని కిద్దామని తిరుగుతూ మంత్రి, ఒక కువిందుణ్ణి (సాలెవాడు) చూసి – విషయం చెప్పి యిల్లు ఖాళీ చేయ మన్నాడు.

వెంటనే ఆ కువిందుడు రాజ సభకు వెళ్ళి 'రాజా! నీ మంత్రి ఇలా అన్నాడు. నీవు ఊ అంటే నేనూ కవిత్వం చెప్తాను' అంటూ—

కావ్యం కరోమి నహి చారుతరం కరోమి
యత్నాత్కరోమి యది చారుతరం కరోమి!
భూపాల మౌళి మణి మండిత పాదపీఠ!
'హే సాహసాంక: కవయామి–వయామి–యామి'

అనే శ్లోకం చెప్పేడు. "మేము కావ్యం వ్రాయగలం. అంత బాగుండక పోవచ్చు. ప్రయత్నం చేసి వ్రాసేమా–ఎంతో అందంగానూ వ్రాయగలం. రాజుల శిరస్సు లందున్న కిరీట మణులచే అలంకరింపబడిన పాద పీఠము గలవాడా! ఓ సాహసాంక! కవయామి=కవిత్వం చెప్తాం. వయామి=వృత్తి రీత్యా నేత నేస్తాం! యామి=అయినా తప్పదు పొమ్మంటే పోతాం"—

రాజు సంతోషించేడు తన రాజ్యంలో నేతగాళ్ళు కూడా ఇంతటి వాళ్ళున్నందుకు. కానీ–అతడు చేసిన ఏకవచన ప్రయోగానికి కొంచెం సందేహించేడు. దాన్ని కూడా సమర్థిస్తూ ఆ కువిందుడేమన్నాడో చూడండి—

డా. అయల సోమయాజుల గోపాలరావు

"బాల్యే సుతానాం సురతేఽంగనానాం
స్తుతౌ కవీనాం సమరే భటానాం
త్వంకార యుక్తాహి గిరః ప్రశస్తాః
కస్తే ప్రభో! మోహతరః స్మరత్వమ్"

"చిన్నప్పుడు పిల్లలు (పెద్దలను), రతిలో స్త్రీలు (ప్రియులను), స్తుతిలో కవులు (పోషకులను), యుద్ధంలో భటులు (ప్రభువులను) ఏకవచన ప్రయోగము చేయడం తప్పు కాదు అన్న విషయం తమకు తెలియనిదా!"—అన్నాడు.

దాంతో భోజుడు సంతోషించిన వాడై ఆ కువిందునికి అక్షర లక్షలతో పాటు అభయమిచ్చి పంపేడు. ఆ పండితునికి మరో గతి కల్పించేడు.

ఇదీ ఆనాటి సామాజిక స్థితి.

కవయామి– వయామి– యామి– ఎంతబాగా అన్నాడు

ఇది చదుపుతూ వుంటే–మరో మన కాలం విషయం గుర్తొస్తుంది—

మన మధురకవి దాశరథితో ఓ మహాకవి అన్నారుట "దాశరథీ, నీ పేర్లో ప్రతి అక్షరం సార్థకమేనోయ్" అనీ

దాశరథి—శరధి—రధి—ధి—



## ఎందరో ఆడవాళ్ళు




అది మూడు పోర్షన్ల డాబా యిల్లు.

ఒక పక్క యింటివాళ్ళుంటారు. వారు ముసలి దంపతులు. కూతుళ్ళు, కొడుకులు పెళ్ళిళ్ళయి ఉద్యోగరీత్యా ఎక్కడెక్కడో స్థిరపడిపోగా వేళకి ఇంత వండుకుని తింటూ, ఓపిక వుంటే ఏ రామాయణమో, భారతమో చదువుకుంటూ కాలక్షేపం చేస్తున్నారు.

ఇక మధ్య వాటాలో వుండేది మహిత, వాళ్ళాయన రామకృష్ణ. ఇద్దరికీ బ్యాంకులోనే ఉద్యోగం. ఇద్దరు పిల్లలు అజిత, బాబు.

ఉదయం లేచింది మొదలు మహితకు ఒకటే హడావుడి! పిల్లల్ని లేపి కాసేపు చదివించటం, ఆ తర్వాత వంట, పిల్లల్ని తయారుచేసి తను తయారై అదరాబదరా నోట్లో యింత కుక్కుకుని బ్యాంకుకి పరుగు పెట్టటం.

ఆఫీసులో.... ఆ ఫైల్స్.... జోకులు, నవ్వులు. విసుర్లు, అకౌంట్లు, ఆ మధ్యలో కాసేపు ప్రస్తుతం వస్తున్న సాహిత్యం గురించి సంభాషణ. సాయంత్రం అయిదు కాగానే మళ్ళా మామూలే. వంట, పిల్లలు, భర్త.

ఎప్పుడైనా కాసేపు తీరిక దొరికితే యింటి వాళ్ళ దగ్గర కూర్చుని వారి యోగక్షేమాల గురించి తెలుసుకుంటుంది. చేసుకుతినే ఓపిక లేని వారనే కనికరంతో తరచూ టిఫిన్సూ, అవీ పంపిస్తుంటుంది వాళ్ళకి.

అందు కోసమని కాదుకానీ, మహిత మాట తీరుకీ, సంస్కారానికి ముసలి దంపతులిద్దరూ ముచ్చట పడుతుంటారు. ఆమె అంటే ఎక్కడ లేని అభిమానం కూడా!

యింటి పనులు ఆడవాళ్ళకే పరిమితమా అని భర్తతో గొంతుచించుకుని పోట్లాడాల్సిన బాధ మహితకు లేదు. ఎందుకంటే రామకృష్ణ అంతగా సహకరిస్తుంటాడు భార్యకి. తన పనులే కాకుండా పిల్లల డ్రెస్, బుక్స్, టిఫెన్స్ సర్దటం లాంటివన్నీ అతనే చూస్తాడు.

ఆ పైన అతను మరింత ముచ్చటపడి చేసే పని మహితకు జడ అల్లటం. ఆమె వద్దంటున్నా వినడు. పొడవుగా, వీపంతా పరచుకున్న జుట్టును ఒక దగ్గరకు చేర్చి.... 'ఏమిటో' వేస్తాడు. అదే జడ వేసే పద్ధతి అంటాడు. అద్దంలో చూసుకుని ఆ జడ పేరేమిటో అర్థం కాక నుదురు కొట్టుకుంది, చిక్కు పడ్డ జుట్టు విప్పుకోడం, మళ్ళా అల్లుకోడం ఆమె దినచర్యలో ఓ భాగంగా తయారైంది!

పైకి విసుక్కున్నా -అదో అందమైన అనుభూతే ఆమెకి.




జీవితం మీద సమగ్రమైన అవగాహన, మంచి చెడుల విచక్షణ వున్న స్త్రీ మహిత. భార్యా భర్తలు సుఖంగా బ్రతకాలంటే అందుకు శక్తివంతమైన సాధనం ఒకరి నొకరు అర్థం చేసుకుని బ్రతకటమే అనుకుంటుంది ఆమె. గొప్ప వ్యక్తిత్వమున్న మనిషి.

భర్తకి తన పట్ల ప్రేమే కాకుండా తనని అర్థం చేసు కుని సహకరించటం వల్లా.... ఆమెకా పరుగులెత్తే జీవితం అలసట కలిగించదు, విసుగూ అనిపించదు

పెళ్ళంటే వ్యాపారంగా ఒకరి అవసరాలు ఒకరు తీర్చే సాధనంగా మారిన ఈ రోజుల్లో అందుకు భిన్నంగా చాలా అరుదుగా కన్పించే దంపతుల్లో మహిత రామకృష్ణలు ఒకరు.

* * *

ఆ రోజు మహిత బ్యాంక్ నుంచి వచ్చే సరికి ఇంటా విడ ఎదురై చెప్పింది.

" మన మూడో పోర్షను ఖాళీగా వుంది కదా ! అది ఈ వేళ ఇచ్చేశానే అమ్మాయ్ ! భార్యా భర్తలు ఇద్దరే వుంటారట. ఒక సంవత్సరమైందట పెళ్ళయ్యి ఇంకా పిల్లల్లేర్ట.చూడ ముచ్చటగా వున్నారు ఇద్దరూనూ ! అబ్బాయికి ఫుడ్ కార్పొరేషన్‌లో నంట వుద్యోగం. రేపు మంచిరోజు దిగుతామన్నారు " అని చెప్పింది.

మహిత నవ్వి అంది. "మంచిది మామ్మా ! మేము పగలంతా యింట్లో దగ్గర వుండటం లేదని గొడవ పెడు తున్నారుగా ! పోనీలే మీకు కాలక్షేపంగా నైనా ఉంటుం దేమో ఆ అమ్మాయి" అంది.

"కాలక్షేపమా ?! ముసలి వాళ్ళం మాతో కాలక్షేపం చేస్తారంటే ఈ కాలపు పిల్లలూ ! నీలా ప్రేమగా పలక రించే వాళ్ళు ఈ రోజుల్లో మరెవ్వరూ కన్పించటం లేదు" అంది.

"మా మీద అభిమానం మీకలా అనిపిస్తుంది కానీ మామ్మా ! పెద్ద వాళ్ళంటే అంత గౌరవం లేకుండా ఎవరూ లేరు. సరేలే, వస్తున్నారు కదా ! చూద్దాం - ఎలాంటి వారో !" అంటూ లోపలికి దారి తీసింది మహిత.

కానీ ఇంటావిడ అనుకున్నట్టుగా కాకుండా కొత్త పోర్షన్‌లో దిగిన దంపతులు ఉష, శివప్రసాద్ లిద్దరూ మంచివాళ్ళ ల్లానే అన్పించారు మహితకి. కాకపోతే ఆ అమ్మాయి బైటకి రావటమే చాలా తక్కువ. ఎప్పుడైనా వస్తే ఇంటివాళ్ళని చాలా ఆప్యాయంగా పలుకరించేది. నవ్వుతూ, గలగల మాట్లాడేది.

* * *

బ్యాంక్‌లో యూనియన్ మీటింగేదో వుండటం వల్ల ఆరోజు ఆలస్యంగా యింటికి వచ్చిన మహితకి తలుపుకి తాళం వేసుండటం చూసి పిల్లల కోసం చూసింది. ఆమె వచ్చేసరికి పిల్లలు యింట్లోనే వుంటారు రోజూ.

'ఏమయ్యారో' అనుకుంటూ గట్టిగా పిల్చింది యింటి వాళ్లింట్లో కూర్చున్నారేమోనని.

"మేమిక్కడున్నాం మమ్మీ !" అంటూ ఉష వాళ్ళిం ట్లోంచి వచ్చింది సమాధానం.

రెండడుగులు అటు పక్కకు వేసి లోపలికి తొంగి చూసింది.

అప్పటికే ఉష బైటకి వచ్చి మహితను చూసి పలక రింపుగా నవ్వి ! "రండి, పిల్లలు ఇక్కడున్నారు. కారమ్స్ ఆడుకుంటున్నారు. కాఫీ తీసుకు వెళ్దురు రండి" అంటూ ఆహ్వానించింది.

ఆమె ఆహ్వానాన్ని మన్నించటానికి-తగిన సమయం కాకపోయినా వెళ్ళిపోవటం బావుండ దనిపించి లోపలికి నడిచింది.

"హల్లో !" అంటూ పిల్ల లిద్దరూ దగ్గరికి వచ్చారు.

"మీరేమిటి యింట్లో కూర్చోక .... ఇక్కడున్నారు. ఆంటీని బాగా ఇబ్బంది పెట్టేస్తున్నారా ? తప్పు కదూ !" అంటూ మందలించింది మహిత.

"భలేవారే, నేను పిలిస్తేనే వచ్చారు. నాకూ కాస్త కాలక్షేపంగా వుంటుందని కారమ్స్ నేర్పు తున్నాను. పైగా పిల్లలంటే నాకు యిష్టం కూడానూ !" అంటూ ఫ్లాస్కులో కాఫీ కప్పులో పోసి మహిత కిచ్చింది.

పిల్లలికి ఆపిల్ జ్యూస్ కలిపిచ్చింది.

కన్ను తిప్పుకోనివ్వని అందం కాకపోయినా ఉషలో ఏదో వింత ఆకర్షణ వున్న దనిపించింది మహితకి.

ఆమె మాటల్లో జలపాతపు దూకుడు.

మొదటి చూపులోనే ఉషపట్ల అభిమానం ఏర్పడింది మహితకు. చాలాసేపు రిలాక్స్‌గా కబుర్లు చెప్పు కున్నా రిద్దరూ !

నాలుగు రోజులు గడిచిపోయాయి. ఆ వేళ రాత్రి పిల్లల్ని నిద్రపుచ్చి, తనూ భోంచేసి మంచం మీద అలా నడుం వాల్చింది. రామకృష్ణ ఫ్రెండ్ పెళ్ళికని వెళ్ళాడు. రావటానికి టైము పడుతుంది.

కాస్త నిద్రపడుతుండగా ధన్‌మని ఏదో సౌండ్ వచ్చి ఒక్క పుదుటున లేచి కూర్చుంది. ఆ ధ్వని ఏ గిన్నెల చప్పుడో, టపాసుల శబ్దమో అయితే అంత కంగారు పడేది కాదామె.

ఎవరినో చెంప పగల గొట్టిన శబ్దం. ఆ పైన వెక్కి వెక్కి ఏడుపు....

మహిత మనసంతా కంగారుగా వుంది. ఆ శబ్దం.... ఆ ఏడుపు ఉషదే ! ఏమైంది వాళ్ళకి. ఎందుకేడుస్తున్నట్టు ఆమె !

" ప్లీజ్, కొట్టకండి. ఇప్పుడు నేనేమన్నానని. ఉత్తరం ఎక్కడి నుంచి వచ్చిందీ అని అడిగాను. అది తప్పా " వెక్కుతూ అనటం విన్పించింది.

" తప్పే. నీకు సంబంధించినదైతే నే చెప్తానుగా. ఫ్రెండ్స్ ఎంత మందో రాస్తుంటారు. అవన్నీ నీకు చెప్పాలా ! పిచ్చి తెలివి తేటలు ప్రదర్శించకు" అతని కంఠం చాలా రౌద్రంగా వుంది.

" ఎందుకండీ తప్పు. మీకు సంబంధించిన విషయాలు నాకు పట్ట కూడదా ! మనిద్దరం పరాయివాళ్ళం కాదు భార్యా భర్తలం. మొన్న నా ఫ్రెండ్ ఈశ్వర్ వచ్చినప్పుడు ఎందుకంత రాద్ధాంతం చేశారు ?

అతన్ని పరిచయం చేస్తుంటే కనీసం విష్ చేయటం కూడా తెలియలేదే మీకు ? మొన్న రాత్రి రామకృష్ణగారు వస్తే వెళ్ళి వీధి గేటు గడ తీసినందుకు.... నన్నెన్ని మాటలన్నారు ? మీరైతే.... " ఆమె మాటలు పూర్తి కానేలేదు అతను " షటప్ " అంటూ గట్టిగా అరిచాడు.

అలా వాళ్ళ వాగ్వివాదం కాస్త విన్పించీ, కాస్త విన పడ కుండానూ చాలా టైమ్ గడచిపోయింది. ప్రక్కన వెక్కిళ్ళు విన్పిస్తూనే వున్నాయి.

ఆశ్చర్యంతో, అసహ్యంతో మహిత మంచం మీద వాలిపోయింది.

అందులో తన భర్త ప్రస్తావన కూడా వచ్చే సరికి విస్తుపోయింది. మొన్నొక రోజు ఏదో పని మీద బైటికి వెళ్ళిన రామకృష్ణ చాలా ప్రొద్దుపోయాక రావటం, నిద్రలో వున్న తనకి అతని పిలుపు వినపడక, మెలకువగా వున్న ఉష వెళ్ళి తలుపు తీసినట్లు భర్త చెప్పటం గుర్తొచ్చింది మహితకి.

అందుకోసం భర్తతో ఎన్ని నిందలు పడిందో విని అతనెంత సంస్కారో పూర్తిగా అర్థమైందామెకి.

పెళ్ళయిన దంపతులు సంపూర్ణమైన ఆనందాన్ని వెతుక్కోడానికి బదులు, ఈ అనుమానాలు దెబ్బలాటలు .... ఛీ, ఛీ ఏం వివాహబంధాలు ! ఏం మగాళ్ళు ? !

అయినా అతనలా అవమాన పరుస్తుంటే పూరికే ఏడుస్తుందెందుకీ పిల్ల! లాగిపెట్టి గూబ మీద ఒక్క టివ్వక ? వెధవ కట్టుబాటంటూ సరిపెట్టేసుకోడం బాగా అలవాటైందీ ఆడవాళ్ళకి ? ! జీవితాన్ని తృప్తిగా అనుభవించటం ఎప్పటికి నేర్చుకుంటారు ?

తప్పదు. చీటికీ మాటికీ.... రగిలే ఈ కుంపటిని పెట్టుకుని ప్రక్కన చూస్తూ సహించటం తనవల్ల కాదు. "ఉషకి బ్రెయిన్ వాష్ చేయాలి, లాభం లేదు" అనుకుంది మహిత.

ఆమెకు చాలాసేపు నిద్రపట్ట లేదు. మనసంతా భారంగా వుంది.

తనకు సంబంధించిన బాధలకి ఎంతగా కదిలిపోతుందో ఎదుటి మనిషి బాధపడినా సహించ లేని మనస్తత్వం ఆమెది. పైగా నాలుగు రోజుల పరిచయంలోనే ఉష ఓ మంచి ఆత్మీయురాలిగా అనిపించిందామెకు.

" ఉషకి నచ్చచెప్పి భర్తని మార్చుకునే ప్రయత్న మేదైనా చేయమని ఉపదేశించాలి ? పాపం చిన్నపిల్ల " అనుకుంది మహిత.

* * *

తెల్లవారింది. ఆ రోజు ఆదివారం. పిల్లల కోసమని మహిత స్వీట్ చేసింది. కొంచెం ప్లేట్‌లోకి తీసి ఉష కోసం ఆమె యింట్లోకి వెళ్ళింది.

ఉష మంచం మీద పడుకునే ఏదో సస్పెన్స్ థ్రిల్లర్ నవల చదువుతూ కనిపించింది.

అలికిడి విని లేచి చూసింది గుమ్మం కేసి.

" రండి. ఏమిటది నా కోసమేనా ! " అంది నవ్వుతూ.

" అవును. ఆపిల్‌తో కొత్త ప్రిపరేషన్. రుచి చూడండి " అంది ఆమె ముఖంలోకి పరిశీలనగా చూస్తూ.

అమాయకంగా కన్పిస్తున్న ఆ ముఖంలో రాత్రి తాలూకూ బాధ, బరువు అంతగా కనిపించటం లేదు. రోజూ కంటే కాస్త డల్‌గా వుంది అంతే ! అనిపించింది మహితకి.

" చాలా బావుంది స్వీటు. మిమ్మల్ని చూసినప్పుడల్లా మీ దగ్గర నేర్చుకోవల్సినవి చాలా వున్నాయని పిస్తుంది. ఇప్పుడు వంట కూడా అందులో ఒక భాగమైంది. " అంది గలగల నవ్వుతూ.

ఆ నవ్వులో ఏదో వెలితి.

" ఈ వేళ సండే కదా ! ప్రోగ్రామేదైనా అరేంజ్ చేసుకోలేదూ ! " అంది మహిత మామూలుగానే !

ఉన్నట్టుండి ఉష ముఖం కళ తప్పినట్టయింది. కళ్ళల్లో దైన్యం.

ఉన్నట్టుండి చేతుల్లో ముఖం దాచుకుని భోరున ఏడ్చింది. ఆమె గుండెల్లో రగులుతున్న బాధ, దాని వేడి భరించటం సాధ్యం కాక, మహిత అభిమాన పూర్వకమైన పలకరింపుకు కరిగి పోయింది.

"ఉషా ! ఏమైంది. ఎందుకా ఏడుపు" అంది భుజం తట్టి.

కొద్ది నిముషాల తర్వాత కళ్ళు తుడుచుకుని అంది. "సారీ అండీ ! ఏమిటో మనసు స్థిరంగా లేక...." అంటూ నవ్వటానికి ప్రయత్నించింది.

"మిమ్మల్ని చూస్తే నామనిషిగా అన్పించి చెప్తున్నాను. మహితగారూ ! బ్రతుకులో ఎన్నో కలలూ, కోరికలూ వుంటాయి. పెళ్ళితో అవి సఫలమవుతా యనుకోడం భ్రమ. కదూ ! బీదా బిక్కీని చూసినప్పుడు ఆర్థిక పరమైన సమస్య చాలా దారుణం అనుకుంటాను. కానీ భర్త వల్ల పొందే పరాభవాలు, అవమానాలు అంతకు మించిన దారుణమని ఇప్పు డనుభవాని కొచ్చింది.

ఆడదానికి యిష్టం లేని పెళ్ళి చేసుకోడానికి అవకాశం ఎలా లేదో, పెళ్ళయాక భర్త మీద తిరుగుబాటు చేసే స్థయిర్యమూ అలాగే ఉండదు.

మావారు ఓ మూర్ఖులు. ప్రతిదానికీ పేచీనే! అహం కారం. అన్నింటినీ మించి పెద్ద అనుమాన పిశాచం....'' ఆమె మాటలకు అడ్డొస్తూ అంది మహిత.

''మీవారింత అనుమానపు మనిషని తెలీక....మొన్న వీధి గేటు మీరు తీసి మీవారితో నిందలు పడినందుకు 'సారీ' చెప్పుకునే ఉద్దేశ్యం కూడా రాలేదు. అనుకోకుండా రాత్రి మీ మాటలు నా చెవిన పడ్డాయి'' అంది.

ఆశ్చర్యపోయి చూస్తూ, ''ఫర్లేదు లెండి. ఈ మగా ళ్ళంతా ఇంతే!'' అంది నిస్పృహగా ఉష.

మహిత నిట్టూర్చి, ''మగవారంతా అలా అయినా కాకపోయినా, మన ఆడాళ్ళదే తప్పుందంటాను నేనైతే! భర్త తత్వం నచ్చక పోయినా అతని అడుగు జాడల్లో నడిచే తత్వం రక్తంలో ఇంకి పోయినా....ప్రయత్నిస్తే సాధ్యం కానిదేం వుంటుంది! ఎలా బ్రతకాలో నిర్ణయించు కుని, ఆ ప్రకారంగా నడవటానికి కావలిసిన ధైర్యాన్ని అలవర్చు కోవాలి.

ఏం చేయగలడు ఏ మగాడైనా? తనంటే అతను యిష్టపడితే ఎంత, పడకపోతే ఎంత? డోంట్ కేర్, లీస్ట్ బాదర్డ్, బ్లడీ....అనుకో గలగాలి. వాళ్ళ తాళితో బంధించి, హింసిస్తుంటే భరించటానికి విచక్షణ లేని పశువులమా?

తలుచుకుంటేనే అవమానంతో మనసు రగిలి పోతుందే! ఎలా భరిస్తున్నారు మీరు?! నో, ఇకనుంచి మీరు ధైర్యంగా బ్రతకటం నేర్చుకోవాలి. ఎంత బలవంత మైన సర్ప మైనా చలి చీమల చేతిలో చిక్కితే ఏమౌతుంది? అంతే!

ఇంత హార్డ్‌గా చెప్తున్నందుకు ఏమని ఊహించు కుంటున్నారో గానీ, మీలాంటి కథలు వింటే హృదయం పుడికి పోతుంటుంది. మార్పు రావాలి. నేను చూడాలి.... అదో తపన.'' మహిత గొంతులో అదో రకమైన నిరాశ.

''మీరు చెప్పింది నిజం. అలా జరిగితే ఆడదాని కథ ఎప్పుడో అడ్డం తిరిగేది. ఆయన్తో ఆర్గ్యూ చేయలేక కాదు. చేయటం వల్ల మరిన్ని సమస్యలు. పోనీ, ఏ యింట్లో అయినా వుండే గొడవేకదా! అనే నిరాసక్తత. అంతే!'' అంది ఉష.

''అదే మానుకోవాలి. మన జీవితం మీద మనకు స్వతంత్రత లేనప్పుడు....బ్రతకటం....అదొక బ్రతుకు కాదు. ప్రయత్నించు మీ వారిని మార్చటానికి'' అంది. ఆమె మాటల్లో పదును, ఆర్తి.

ఉష వాటిని గ్రహిస్తున్నట్టుగా తలూపింది.

* * * *

అదే రోజు సాయంకాలం అయిదు గంటలు. చల్లటి గాలి. మలి సంధ్య వెలుగులు.

యింటి ముందు పూల మొక్కలకి నీళ్ళు పడుతుంది మహిత.

ఎక్కడినుంచో గట్టిగా నవ్వులు వినిపిస్తుంటే ప్రక్కకి తిరిగి చూసింది.

ఉష, వాత్స్యాయన శివప్రసాద్‌ల స్వరమని గ్రహించ టానికి ఎక్కువసేపు పట్టలేదు.

అణుచుకున్నా ఆగని నవ్వు కట్టలు తెంచుకు వస్తు న్నట్టు నవ్వుతున్నా రిద్దరూ.

అతనేదో అంటున్నాడల్లే వుంది. 'ఏయ్ యూ' అంటూనే నవ్వుతూంది ఉష.

అక్కడితో ఆ వెల్లువ ఆగలేదు. మరో పావు గంట కల్లా....ఇద్దరూ ట్రిమ్‌గా తయారై స్కూటరెక్కారు.

మహితను చూసి పలకరింపుగా నవ్వింది ఉష.

ఆమె కూడా నవ్వింది.

వీధి గేటు తీసుకుని బైటికి వెళ్ళాక ఉష భర్తతో ''ఇప్పుడే వస్తా'' నంటూ వేగంగా లోపలికి వచ్చింది.

మహిత నిటారుగా అయింది.

''మహితగారూ! నన్ను చూస్తే ఆశ్చర్యంగా, వికా రంగా కూడా వుండి వుండవచ్చు కదూ! కానీ తప్పదు. సాంసారిక జీవితంలో కలహాలు ఎంత సహజమో, సర్దు బాటులూ అంతే సహజం. ఇందులో వ్యక్తిత్వాల ప్రసక్తేముంది?!

పెళ్ళి, సుఖవంతమైన సంసారం వీటి ప్రాధాన్యతలు గుర్తిస్తూ బ్రతకాల్సిన రోజులు కావివి. ఆయన ఫ్రిజ్, ఫర్నీచర్, గోల్డ్ ఇవన్నీ కొనబోతున్నారు. ఈ రోజుల్లో మనసుకంటే వీటిని గురించిన తాపత్రయాలే ఎక్కువ. నలుగురిలో సోషల్ స్టేటస్ మెయిన్‌టైన్ చేయటం అదో తృప్తి.

ఎవరూ పట్టించుకోని మిగతా విలువల కోసం ఆలోచించి జీవితాల్ని అడ్డం తిప్పుకోడం ఎందుకు అనిపిస్తుంది.

వస్తాను. పిక్చర్‌కి వెళ్తున్నాం. ఆయన చూస్తున్నారు. బై" అనేసి ఒక్క పరుగు తీసింది బైటికి.

ఈకాలపు స్త్రీ ఆలోచనల వాస్తవికతను తన బుర్రలో ఇముడ్చు కోడానికి ప్రయత్నిస్తూ, అలాగే చూస్తుండి పోయింది ది పూర్ మహిత.



# స్వీకారం

" కట్నం కథలు "
రచన : కాలువ మల్లయ్య వెల : రు. 8-00

" కవితా సౌరభం "
రచన : కాలువ మల్లయ్య వెల : రు. 4-00

" కవితా ఝురి "
రచన : కాలువ మల్లయ్య వెల : రు. 3-00
ప్రతులకు : కాలువ మల్లయ్య
20-64 ఫెర్టిలైజర్ సిటి-505 210 (కరీంనగర్ జిల్లా)

" న్యూ సొసైటీ మేనిఫెస్టో "
రచన : యన్. సి. భగవాన్‌దాస్ వెల : రు. 3-00
ప్రతులకు : యన్. సి. భగవాన్ దాస్
న్యూ సొసైటి పార్టీ ఆఫీసు 29-10-23
ప్రకాశంరోడ్ విజయవాడ—2

" సామెత "
రచన : శ్రీమతి సి. వేదవతి, వెల : రు. 20-00
ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య
26-162 బుట్టాయిపేట మచిలీపట్నం.

" విషకన్య " నవల
రచన : వాసిరెడ్డి సీతాదేవి, వెల : రు. 25-00
ప్రతులకు : స్పందన సాహితీ సమాఖ్య
26-162 బుట్టాయిపేట మచిలీపట్నం.

" మనసైతే ఒకటేనోయ్ "
రచన : " శ్రీ కాట్రగడ్డ " వెల : అమూల్యం

" శ్రీ కాట్రగడ్డ కవితాభేరి "
రచన : " శ్రీ కాట్రగడ్డ ", వెల : అమూల్యం

" కొల్లేటి పాటలు "
రచన : కాట్రగడ్డ : వెల : అమూల్యం
ప్రతులకు : " శ్రీ కాట్రగడ్డ "
24 ఎ -10-4 అశోక్‌నగర్ ఏలూరు-2

" తెలుగు వన్నెలు "
రచన : డి. యస్. రామారావు, వెల : రు. 10-00
కూర్పు : సత్య, డి. బి. యన్ (ఉస్మానియా)
సమర్పణ : విజయసాహితీ,
ప్రతులకు : విజయసాహితీ, హెచ్. నెం. బి. 2004
హిల్ కాలని, నాగార్జునసాగర్.

" వాల్మీకి " పద్యకావ్యము
రచన : వేదుల మీనాక్షీదేవి వెల : రు. 8-00

" ఫల్గుణీ మహాత్మ్యము "
రచన : వేదుల మీనాక్షీదేవి వెల : రు. 5-00
ప్రతులకు : వేదుల మీనాక్షీదేవి,
దానవాయిపేట, రాజమండ్రి.

" గీతా కల్పతరువు "
రచన : కారుపల్లి కళ్యాణరామ్ వెల : 5-00
ప్రతులకు ; 40/ఎ కిల్‌గొల్లపేట.
హోసూరు-635 109, ధర్మపురిజిల్లా, తమిళనాడ్. ★

# అభిప్రాయ వేదిక

" నిర్మలాకాశాన వికసించిన పూర్ణచంద్రునిలా సాహితీవనాన విరిసిన నవ స్వర్ణ సుమశోభితమైన 'శ్రీవాణి' ని దర్శించిన ప్రథమక్షణంలోనే నాహృది ఆనంద పులకాంకితమైనది. అమృతవాణితో ప్రారంభమై, ఉత్తమ సంపాదకీయం, చక్కని సందేశాన్నందించే కథలు, కవితలతో, నవ్వులహరివిల్లుతో, ప్రబంధ శిల్పాన్ని కనులకు గోచరింపచేసి, భావకవిలా శైలి తెలిపి, వాల్మీకి వాణి విన్పించి, పరుష వాక్యం పలుకరాదన్న సూక్తినందించి- ఇలా ఆద్యంతం రమణీయంగా సాగింది- 'శ్రీవాణి' "

– అంజన, ఉండి

" తమరు చేసే ప్రయత్నం చాలా సాహసమైనది. సాహిత్యంతో పాటు సంస్కృతికి కూడా చాలా ప్రాముఖ్యత యిస్తున్నారు సంతోషించదగ్గ విషయం."

– బి. వెంకటేశ్వరరావు, విజయవాడ

" శ్రీవాణి నాలుగు సంచికలు ఆకర్షణీయంగా వున్నాయి. పత్రికా నిర్వహణ కష్టతరమైన ఈ రోజులలో సాహసంతో సాంస్కృతిక మాస పత్రికను చేబట్టి సమర్థవంతంగా నడిపిస్తున్నందుకు అభినందనీయులు.

– కవుల ఆంజనేయశర్మ, అనకాపల్లి

" ఒకసారి చదివి బీర్వాలో పడేసే సంచికలా కాక నెలపొడుపునా చదివిస్తున్నది శ్రీవాణి "

– కావిలిపాటి విజయలక్ష్మి, శృంగవరపుకోట

" శ్రీవాణి మూడవ పత్రిక చూచాను. బందరు నుండి గతంలో వెలువడి ప్రశస్తిగాంచిన కృష్ణా పత్రిక వలె యీ మాస పత్రిక కూడ వారపత్రికగా మారి శోభిల్లుగాతయని తలచెదను. "

– కవితా కామేశ్వరశర్మ, అవనిగడ్డ

" I am very happy to note that you are bringing out a very valuable cultural paper of different affairs useful to the public."

— SISTLA LAKSHMIPATHI SASTRY, Vijayawada

"ఇంత పెద్ద సంచికను నడుపబూనిన మీ సాహసాన్ని, సాహిత్య కృషిని అభినందించకుండా వుండలేను. త్వర త్వరగా తెరమరుగవుతున్న ఎన్నో పత్రికలను చూచిన దృష్ట్యా మీ పత్రికను గూర్చి ఆశపడుతున్నాను. ఇది స్థిరంగా సాహిత్య ప్రపంచంలో జీవించాలని కోరుకుంటున్నాను."

– కొలకలూరి స్వరూపరాణి, మోద

"అన్నీ తెలిసిన అంశాలే – అయినా చదవాలనే తలంపుతో మీ వివేకానంద వ్యాసం చదివాను. స్వామీజీ ప్రబోధం పట్ల మీకుగల అవగాహన, విధేయత నన్నెంతో ఆకట్టుకున్నాయి. వ్యాసంలో– మీరు వాడిన భాష, ఎన్నుకున్న అంశాలు అంతా నచ్చింది. ఆచరణకు ఉపక్రమించ గలిగే వారే– ఈ వ్యాస రచన చేయగలరని భావించాను. యాంత్రిక రచనలకు–స్వాభావిక రచనలకు వ్యత్యాసం కన్పిస్తుంది వ్యాసం చదివిన తరువాత–నాకు కల్గిన సంతోషం మూలంగా – మీ అమూల్యకాలాన్ని వ్యయపరిచాను."

– శ్రీవాసవ్య, నూజివీడు

" నిజంగా మీరు చేస్తున్నది గొప్ప సాహసం. కుప్పలు కుప్పలుగా విరుచుకుపడుతున్న వ్యాపార పత్రికల మధ్య ఒక చక్కటి సాహిత్య సాంస్కృతిక మాస పత్రికను నిలబెట్టబూనుకోవడం గొప్ప సాహసం."

– జ్యోత్స్న-రాయగడ, ఒరిస్సా

"ఉత్తమ సాహిత్యాభిరుచి, సాంస్కృతిక విలువలు లుప్తమౌతున్న ఈ తరుణంలో 'శ్రీవాణి' సాంస్కృతిక పత్రికగా ప్రారంభింపబడటం సహృదయ ముదావహమైన విషయము. సామాజిక వ్యవస్థ మొత్తమూ కలుషితమైన ఈ విషమకాలంలో మీ ప్రయత్నము గొప్పసాహసమని భావిస్తున్నాను. మీ ఉన్నతాశయం నెరవేరాలని, మీ ప్రయత్నం ఉజ్వల ఫలితాలనివ్వాలని ఆశిస్తున్నాను."

– గడియారం శేష ఫణిశర్మ, పాల్వంచ